## INSIDE



మీ అభిప్రాయాలను పోస్టు ద్వారా **ఆదివారం ఆంధ్రజ్యోతి**, *రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33కు, మెయిల్ ద్వారా sunday.aj@gmail.comకు పంపండి.*



## మిత్రవాక్యం

'**మా**నవత్వపు గోడ' ఎంత మంచి ఆలోచన! మనకు ఏమాత్రం అవసరం లేని ప్రతి వస్తువూ, ఎవరో ఒకరికి అత్యవసరమై ఉంటుంది. దాని వల్ల అవతలి మనిషి కష్టం తీరుతుంది, సమస్య పరిష్కారం అవుతుంది. హైదరాబాద్ నగరంలో జీహెచ్ఎంసీ చొరవతో ఏర్పాటవుతున్న 'మానవత్వపు గోడ'లకు మంచి స్పందన వస్తోంది. అవసరం కొద్దీ కొన్న పుస్తకాలో, డిస్కౌంట్ల మీద మమకారంతో షాపింగ్ చేసి పడేసిన బట్టలో, ఎలక్ట్రానిక్ ఉపకరణాలు వచ్చాక మూలన పడేసిన స్టీలు సామాన్లో, ఓపిక లేక అటకెక్కించిన వ్యాయామ సాధనాలో... ఏవైతేనేం. నిరభ్యంతరంగా పంచుకోవచ్చు. పైపైకి ఇదంతా సులభంగా అనిపిస్తుంది కానీ... మనకు అస్సలు అవసరం ఉండదని తెలిసినా సరే, పూచికపుల్లను కూడా వదులుకోడానికి ఇష్టపడం మనం. ఆ 'చెత్త' మమకారాన్ని తగ్గించుకుంటే ... మనసుకు చాలా హాయిగా ఉంటుంది, మరొకరికి సాయపడ్డామన్న సంతృప్తీ దక్కుతుంది. బుర్రలో బాసింపట్టేసుకుని కూర్చున్న ... చిలుము పట్టిన భావాల్నీ, కాలం చెల్లిన ఆలోచనల్నీ వదిలించుకోడానికి కూడా ఈ కసరత్తు పనికొస్తుంది. ముందు భౌతికమైన వ్యర్థాల్ని వద్దనుకుంటే, ఆ తర్వాత మానసికమైన లగేజీని సులభంగా దించేసుకోవచ్చు. ■




## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

### ◆ యోగం - భోగం

ప్రధాని నరేంద్ర మోదీ ప్రభుత్వ విధానాలను, పనితీరును యోగాసనాలతో పోల్చి చెబుతూ వచ్చిన ఈ వారం కవర్‌స్టోరీ 'నరేంద్ర యోగా' చాలా బాగుంది. 122 కోట్ల మంది ఉన్న దేశానికి ప్రధానిగా ఎదిగిన నరేంద్రుడు నిజంగా ఒక యోగి. చెప్పాపెట్టకుండా ప్రజల చేత నోట్లరద్దు శీర్షాసనం వేయించిన ఆయన, ఆ ఆసనంతో తన దేశానికి, దేశ ప్రజలకు రాజభోగం దక్కాలని ఆరాటపడ్డారు. ఆ భోగం దక్కక పోయినా కొందరు అవినీతిపరుల రోగం మాత్రం కుదిరింది. ఆయన చేపట్టే పనుల్లో కొన్ని ఇబ్బందికరంగా అనిపించొచ్చు. కానీ అవి దేశానికి మంచి చేసేవే.

**- భాస్కరరావు,** కడప

### ◆ మనుషుల్ని బట్టి

**ఈ** వారం కథ 'అనుభవ పాఠం' చాలా బాగుంది. అపార్టుమెంటు సంస్కృతి రాకపోతే మధ్యతరగతి వారికి సొంత ఇంటి స్వప్నం, ఎప్పటికీ కలగానే ఉండిపోయేది. ఇబ్బందులు సొంత ఇంట్లోనైనా, అద్దె ఇంట్లోనైనా, అపార్ట్‌మెంట్‌లోనైనా... ఎక్కడైనా ఉంటాయి. అది సాటి మనుషులతో మనం మసలుకునే విధానాన్ని బట్టి ఉంటుంది.

**- వి. భాస్కరరావు,** పాలకొల్లు

### ◆ లవ్ యూ నాన్నా...

**ఫా**దర్స్ డే సందర్భంగా ఇచ్చిన 'ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్‌స్టార్... మా నాన్న సూపర్‌స్టార్!' కథనం మాకెంతో నచ్చింది. తెరమీద స్టార్‌లుగా వెలిగిపోయే మన హీరోలు, తమ వారసుల ముందు మాత్రం వారికి వీరాభిమానులుగా మారిపోతారు. 'నాన్నా' అన్నా... 'డాడీ' అన్నా... ఆ ఆత్మీయ పిలుపులో ఉన్న మ్యాజిక్ అది.

**- పాగా సుదర్శన్,** కొకునూరు

### ◆ ఈ 'క్షణం' నిజం

పవన్‌కల్యాణ్ 'పంజా' మూవీలో సైకోగా అడివి శేష్ నటన హైలైట్. దర్శకుడు రాజమౌళి కూడా ఒక సందర్భంలో ఇదే చెప్పారు. అడివి శేష్ చెప్పిన విశేషాలు ఎంతో ఆకట్టుకున్నాయి. ఎటువంటి సినిమా నేపథ్యం లేకుండా 'క్షణం' వంటి సూపర్‌హిట్ కొట్టాడంటే, అతనిలోని ప్రతిభకు నిదర్శనం మరేముంది. ఆ యువ నటుడికి మంచి భవిష్యత్తు ఉంది.

**- పిచ్చుక మనోజ్‌కుమార్,** తూ.గో

### ◆ కవితా ఘోష!

'**అం**తర్జాల ఘోష' కవిత ఆలోచింపజేసింది. కవి మిత్రులు సుధాకర్‌గారికి అభినందనలు. గుర్తుమరచునంతర్జాల ఘోష కవిత, చదివియానంద మందితి చక్కగానూ, యువత చదివిన దీనిని యుక్త మతి, బతుకు నిజము తెలియును, భ్రాంతి తొలగు.

**- ఆచార్య లక్ష్మణ పెద్దింటి,** యానాం






# నా దగ్గర డబ్బుంది. మీ దగ్గర ఐడియా ఉందా?

అమెజాన్ వ్యవస్థాపకుడు జెఫ్ బిజోస్‌కు హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చింది. తన దగ్గరున్న కోట్లాది రూపాయల సంపదలో కొంతభాగాన్ని జనం కోసం ఖర్చుపెట్టాలనుకున్నాడు. అదీ, ఏ పదేళ్ల తర్వాతో పాతికేళ్ల తర్వాతో ఫలితం ఇచ్చే ప్రాజెక్టుల మీద కాదు. ఆ ప్రభావం తక్షణం కనిపించాలి. ఆ మార్పు వెంటనే మొదలుకావాలి. చకచకా జీవితాలు మారిపోవాలి. అలాంటి ఐడియా ఏదైనా ఉంటే ఇవ్వమంటూ ట్విటర్‌లో ఓ అభ్యర్థన పెట్టాడు. ప్రపంచం నలుమూలల నుంచీ అనూహ్యమైన స్పందన వచ్చింది. ప్రతి ఆలోచనా సమాజంలోని ఓ సమస్యకు అద్దం పడుతుంది.






‘అర్జంటుగా డబ్బు అవసరమైంది. అప్పులవాళ్లు వెంటపడుతున్నారు. నయాపైసాతో సహా అన్నీ తీర్చేసి పుణ్యం కట్టుకోండి సార్’



‘వద్దు. తొందరపడి ఎవరికీ డబ్బు ఇవ్వకండి. ఆ నిధులతో కంపెనీలు పెట్టండి. ఉపాధి సృష్టించండి’



‘ఇప్పటి పరిస్థితుల్లో సెల్‌ఫోన్ అనేది తప్పనిసరి అవుతోంది. ఫోను లేని ప్రతి ఒక్కరికీ ఓ సెల్‌ఫోన్ ఇప్పించండి. చాలా ఉపయోగం ఉంటుంది. అదేసమయంలో నామమాత్రపు ధరకే ఇంటర్నెట్ కూడా ఇవ్వండి’



‘ప్రపంచంలో ఊబకాయాన్ని మించిన సమస్య లేదు. బరువుతో బాధపడుతున్నవారికి చికిత్స చేయించండి. అవసరమైతే శస్త్ర చికిత్సా చేయించండి’



‘ఓ మాట చెబుతాను జాగ్రత్తగా వినండి. ఓ లక్ష మంది యువకుల్ని ఎంచుకోండి. మూడేళ్లపాటూ... నెల నెలా కచ్చితమైన ఆదాయం వచ్చేలా ఓ ఏర్పాటు చేయండి. ఆ సమయం చాలు. తమను తాము నిరూపించుకుంటారు. ఎవరికి తెలుసు, గూగుల్ గూబ దరగొట్టే కంపెనీని పెడతారేమో, అమెజాన్ అమ్మ మొగుడిలాంటి వ్యాపారాన్ని ప్రారంభిస్తారేమో. దయ చేసి ఎంట్రప్రెన్యూర్‌షిప్‌ను ప్రోత్సహించండి’



‘విరాళాలిచ్చి బద్ధకస్తుల్ని చేయకండి. ఎవరూ ఎవరి జీవితాల్నీ మార్చక్కర్లేదు. ఎవరికి వారే మార్చుకోగలరు. విరాళాలు ఆత్మాభిమానాన్ని దెబ్బతీస్తాయి’



‘కొన్ని వేల ఎకరాల భూమి కొనేయండి. అక్కడ అడవుల్ని పెంచండి. కాలుష్యం తగ్గిపోతుంది. జనం హాయిగా ఊపిరి పీల్చుకుంటారు. ఏమంటారూ?’



‘నిజాయతీపరులైన రాజకీయ నాయకుల్ని ఎంచుకుని... ఎన్నికల ప్రచారానికి నిధులు ఇవ్వండి’



‘సకల సమస్యలకూ అనారోగ్యమే మూలం. అనారోగ్యానికి కల్తీ ఆహారమే కారణం. పోషక విలువలున్న దినుసుల్ని ఉచితంగానో, నామమాత్రపు ధరకో సరఫరా చేయండి. జనం ఆరోగ్యానికి ఢోకా ఉండదు’



‘వృథాగా పడున్న షిప్పింగ్ కంటెయినర్లను తూకానికి కొనుక్కుని వాటిని... చిన్నచిన్న ఆవాసాలుగా మార్చవచ్చు. దీనివల్ల లక్షలమందికి నీడ దొరుకుతుంది’



‘మా బాసు పరమదుర్మార్గుడు. వాడి దగ్గర ఒక్కక్షణం కూడా పనిచేయాలన్లేదు. కానీ ఎడ్యుకేషన్ లోన్ ఉంది. ఆ అప్పు కోసమే రాజీపడుతున్నా. రుణం తీర్చి నాకు విముక్తి కల్పించండి. మొత్తంగా విద్యారుణాలన్నీ తీర్చేయండి’



‘డిప్రెషన్ అతిపెద్ద మానసిక సమస్య. వెంటనే చికిత్స అందించండి. జెనరిక్ మందుల్నీ ప్రోత్సహించండి’



‘మంచి ఇల్లు కట్టుకోవాలని కోరిక. జానాబెత్తెడు జీతాలతో ఆ ఆశ తీరేట్టులేదు. మీరు తలుచుకుంటే అదో పెద్ద పనేం కాదు...’

# అనంత పుణ్యఫలదాయిని...

**తొలి ఏకాదశి అనగానే ఓ అలౌకికానందం వెల్లివిరుస్తుంది. కారణం, ఆ పండుగ ఆనందాన్నే కాక అనంతపుణ్యఫలాన్నీ, ఆయువునూ ఆరోగ్యాన్నీ ప్రసాదిస్తుందని బలమైన నమ్మకం. ఓ రకంగా, రానున్న పర్వ దినాలకు పవిత్ర ద్వారం ఇది. జులై 4న తొలి ఏకాదశి.**

**ఆ**షాఢ శుద్ధ ఏకాదశి తొలి ఏకాదశి. దీన్నే సంస్కృతంలో ప్రథమ ఏకాదశి అనీ, శయన ఏకాదశి అనీ, శేషశయన ఏకాదశి అనీ, పద్మ ఏకాదశి అనీ ఇలా ఎన్నో పేర్లతో పిలుస్తారు. వైకుంఠవాసుడైన మహావిష్ణువు జగన్నాయకుడు. జగత్తుకంతటికీ మూలకారకుడైన ఆ స్వామి తాను చేసిన సృష్టిలోని జీవరాశులను ఎలా నియంత్రించాలి, వారికి ఏ విధమైన పుణ్యాన్ని ప్రసాదించాలి, మరే విధమైన మంచి మార్గాన్ని సూచించాలి... అని ఆలోచిస్తూ యోగనిద్రలోకి వెళుతుంటాడు. యోగనిద్రకూ మామూలు నిద్రకూ చాలా భేదముంది. యోగనిద్ర ధ్యాన సంబంధమైనది. లోకాల మంచి చెడులను పరిశీలించటమే మహావిష్ణువు యోగనిద్రలో ఉన్న విశేషం.

**చాతుర్మాస్యం...**

ఆషాఢ శుద్ధ ఏకాదశి నాడు ప్రారంభమయ్యే ఆ యోగనిద్ర కార్తిక శుద్ధ ద్వాదశి వరకు ఉంటుంది. ఈ నాలుగు మాసాల కాలాన్ని చాతుర్మాస్యం అంటారు. చాతుర్మాస్యం ఓ విశేషమైన వ్రతం కూడా. ఈ నాలుగు నెలల్లో ఎన్నెన్నో పండుగలు వస్తుంటాయి. అన్నిచోట్లా పర్వదిన వాతావరణం కనిపిస్తూ ఉంటుంది. దీనితో పాటుగా వర్షాలు పడటం, వాతావరణంలో మార్పులు రావటం కూడా జరుగుతుంది. ఈ మారిన కాలంలో ఓ క్రమశిక్షణాయుత ఆహార, విహార, వ్యవహారశైలి ఉండాలి. సమాజం మొత్తానికి ఈ అంశాలలో క్రమశిక్షణను నేర్పుతూ ఆరోగ్య పరిరక్షణకు దోవను చూపుతుంటుంది తొలి ఏకాదశి. సర్వసాధారణంగా ప్రతి సంవత్సరం, ప్రతి మాసంలోనూ కృష్ణ, శుక్ల పక్షాలలో ఒక్కొక్కటి చొప్పున... పన్నెండు మాసాలలోనూ ఇరవై నాలుగు ఏకాదశులు వస్తుంటాయి. అధిక మాసం వచ్చినప్పుడు మరో రెండు కలుస్తాయి. ఏకాదశి నాటి పూజ, వ్రతం, ఆహార నియమాలు అన్నీ పుణ్యప్రదంగా ఉండడమేకాక ఆరోగ్య సూత్రాల పరంగానూ విశేషమైనవే. సర్వసాధారణంగా తొలి ఏకాదశికి అధిక పుణ్యఫలదాయిని అని పేరుంది. ఆ రోజున చేసే దానధర్మాలు, పూజాదికాలు, ఉపవాసాలు ఇతర ఏకాదశులకన్నా వెయ్యి రెట్లు పుణ్యఫలాన్ని ఇస్తాయని చెబుతున్నాయి వ్రతగ్రంథాలు.

**త్రిరాత్ర వ్రతం**

ఏకాదశి పండుగ ఉపవాస ప్రధానమైంది. దశమి నాటి రాత్రి, ఏకాదశి రెండు పూటలా, ద్వాదశి నాటి రాత్రి పూట ఉపవాసం చేసే త్రిరాత్ర వ్రతం ఉంది. మూడు రాత్రులలో నాలుగు పూటలు ఉపవాసాలు దీనిలోని ప్రధానాంశం. వైకుంఠవాసుడైన శ్రీ మహావిష్ణువు దగ్గరకు దశమి నాటి రాత్రి ముక్కోటి దేవతలూ వచ్చి అర్చిస్తారు. కనుక ఆ సమయంలో భక్తులు ఉపవాసదీక్షతో స్వామిని ఆరాధించాలి. అంతమంది దేవతలు ఆ లోకైకనాథుడిని స్తుతించే సమయంలో ఉపవాసంతో మనసునూ శరీరాన్నీ శుద్ధంగా ఉంచుకుంటే తప్ప భగవంతుడి మీద మనసు లగ్నం కాదు. దేవదేవుడి మీదే చిత్తాన్ని నిలిపి భక్తితో పూజించడం అవసరం. మరుసటి రోజున, అంటే ఏకాదశి నాడు రెండు పూటలా ఉపవాసంతో హరి పూజా సంకీర్తనలతో కాలం గడపాలి. ఆ మరునాడు ద్వాదశి సమయంలో పగటిపూట పారణ చెయ్యాలి. అంటే ప్రసాదాన్ని స్వీకరించాలి. ఆ రాత్రికి మళ్లీ ఉపవాసం చెయ్యటంతో ఈ వ్రతం ముగుస్తుంది. ఇంతటి కఠోర క్రమశిక్షణాయుత నియమాల లక్ష్యం... రాబోయే నాలుగు నెలలూ పర్యావరణంలో సంభవించే మార్పులను తట్టుకోవటం, శారీరకంగా రోగనిరోధక శక్తిని పెంచుకోవటం. జీర్ణకోశ వ్యవస్థ చక్కగా పనిచేయటానికి, ఇంద్రియ నిగ్రహంతో అనేకానేక శుభకార్యాలూ పండుగలూ ఉత్సవాలూ నిర్వహించటానికి తగినంత మానసిక, శారీరక దృఢత్వం ఉపవాసదీక్షల వల్ల సమకూరుతుంది.

**రుక్మాంగదుడు**

ఈ ఉపవాసదీక్షా వ్రతాన్ని ఎన్నో యుగాల నుంచీ అనుసరిస్తూ భగవంతుడి అనుగ్రహాన్ని పొందుతున్నారు మహాభక్తులు. దానికి ఉదాహరణే రుక్మాంగదుడు. పూర్వం రుక్మాంగదుడు అనే ఓ రాజుండేవాడు. ఆయనకు ఏకాదశీవ్రత మహిమ బాగా తెలుసు. దాంతో తానొక్కడే కాకుండా తన రాజ్యంలోని వారందరి చేతా వ్రతాన్ని చేయించసాగాడు. రుక్మాంగదుడిలోని భక్తిని, ఇంద్రియనిగ్రహశక్తిని పరీక్షించాలనుకున్నాడు దేవేంద్రుడు. వెంటనే రంభను పంపాడు. ఆమె వెళ్లింది. రుక్మాంగదుడు వలచి వచ్చిన రంభ మోహంలో పడ్డాడు. అయితే ఇంతలో ఏకాదశి సమీపించింది. తన మోహానికి వశుడైన రాజును ఉపవాసదీక్ష చెయ్యొద్దని కోరింది ఆమె. కానీ రాజు ఒప్పుకోలేదు. అప్పుడామె, తాను కావాలంటే తన మాట వినాలని అంది. రాజు అలా కాకుండా మరింకేమైనా కోరమన్నాడు. అప్పుడామె రాజుకున్న ఒక్కగానొక్క కుమారుడిని దూరం చేసుకోమంది. రుక్మాంగదుడు అందుకైనా సిద్ధపడ్డాడు కానీ, ఏకాదశి వ్రతాన్ని మానుకుంటాననలేదు. ఆ రాజు భక్తిని, దీక్షను గమనించిన శ్రీమహావిష్ణువు ఆయనకు మోక్షాన్ని ప్రసాదించాడు.

**గోపద్మ వ్రతం**

భారతీయ సనాతన సంప్రదాయంలో సర్వదేవతా స్వరూపంగా గోవుకు గొప్ప స్థానం ఉంది. ఆ స్థానం తొలి ఏకాదశి పర్వదినాన కూడా నిరూపితమవుతూ ఉంటుంది. దానికి కారణం తొలి ఏకాదశి నాడు జరిపే గోపద్మ వ్రతం. ఆ రోజున గోశాలను చక్కగా శుభ్రం చేసి అలికి రంగవల్లికలను తీర్చిదిద్దుతారు. గోశాల మధ్యలో బియ్యపు పిండితో పద్మాన్ని తీర్చిదిద్ది అందులో లక్ష్మీనారాయణుల పూజచేసి నివేదనలను సమర్పిస్తారు. గోవులకు కూడా అలంకార పూజలు చేస్తారు. ఇలా ఎన్నెన్నో విశిష్టతల సమాహారం తొలి ఏకాదశి పర్వదినం. ఈ రోజున దేవుడికి నివేదనగా పేలపిండి, బెల్లం కలిపిన పదార్థాన్ని సమర్పిస్తారు.

**- శ్రీమల్లి, 73829 27069**



# ఆ అలవాటును మాన్పించడం ఎలా?






**మేడమ్... మా అబ్బాయి ఎక్కడికెళ్లినా, ఎవరింటికెళ్లినా అక్కడ బొమ్మలు, బిస్కెట్లు, ఫోన్లు... ఇలా ఏముంటే వాటిని తీసుకుని ఇంటికి పట్టుకొస్తుంటాడు. వాణ్ణి తీసుకుని ఎవరింటికైనా వెళ్లాలంటే సిగ్గేస్తోంది. ఈ అలవాటును ఎలా మాన్పించాలి?**

**- ఎం.లలిత, కరీంనగర్**

మీరు పిల్లాడి వయసు రాయలేదు. ఒకవేళ పిల్లాడి వయసు ఐదారేళ్లయితే ఆ వయసు పిల్లల్లో ఇలాంటి అలవాటు సాధారణమే. కంగారుపడాల్సిందేమీ లేదు. అలా కాకుండా కొద్దిగా పెద్దవాళ్లయితే మన వస్తువులేమిటి, పరాయి వస్తువులేమిటనే విషయాన్ని స్పష్టంగా, వారికి అర్థమయ్యేలా చెప్పాలి. మన ఇంట్లో ఉన్నవి మాత్రమే మన వస్తువులనీ, వేరే చోట్ల ఉన్నవి మనవి కావనీ పదే పదే చెబుతుండాలి. ఒకవేళ పిల్లలు పొరుగింట్లో నుంచి ఏదైనా వస్తువు తీసుకొస్తే, మీరే తీసుకెళ్లి ఇవ్వకుండా... మీతో పాటు పిల్లాడిని కూడా వెంట తీసుకెళ్లి, దాన్ని తనే వారికి వెనక్కి తిరిగి ఇచ్చేలా ప్రోత్సహించాలి. ఇలా చేస్తే కొన్నాళ్లకు తను చేస్తున్న తప్పు తెలుసుకుంటాడు. క్రమక్రమంగా ఆ అలవాటు నుంచి బయటపడతాడు.

**మా అబ్బాయి ఇంజనీరింగ్ చదువుతున్నాడు. ఈమధ్యనే వాడికొక స్మార్ట్‌ఫోన్ కూడా కొనిచ్చాను. ఇంటర్నెట్ సౌకర్యం ఉంది. అయితే ఇటీవల వాడి ఫోన్ చూసి షాకయ్యాను. ఫోన్ హిస్టరీలో వాడు తరచూ 'పోర్న్' చూస్తున్నట్లుగా ఉంది. దాంతో నాలో ఆందోళన మొదలయ్యింది. వాడితో ఆ అలవాటు మాన్పించాలంటే ఏం చేయాలి?**

**- భూషణ్, హైదరాబాద్**

అబ్బాయి వయసు అలాంటిది. సాధారణంగా ఈ వయసులోనే అబ్బాయిలు స్మోకింగ్, డ్రింకింగ్‌కు అలవాటుపడతారు. వాటిల్లో వారికి తెలియని మజా ఏదో దొరుకుతున్నట్లుగా ఫీలవుతారు. సరిగ్గా అలాంటిదే పోర్నోగ్రఫీ చూడటం కూడా. దీనివల్ల వారికి సెక్స్‌పరమైన ఉత్తేజం, సంతృప్తి లభిస్తుంది. ఈ రోజుల్లో ఇంటర్నెట్‌లో పోర్న్ వీడియోలు అందుబాటులో ఉంటున్నాయి కాబట్టి పిల్లలు వాటివైపు సులువుగా ఆకర్షితులవుతుంటారు. సమయం, సందర్భం చూసుకుని వారితో అప్పుడప్పుడు 'సెక్స్'కు సంబంధించిన విషయాలపై కూడా మాట్లాడుతుండాలి. వారికి దానిపై అవగాహన కల్పించాలి. పోర్నోగ్రఫీలో చూసేదంతా వాస్తవం కాదనీ, జీవితం వేరేగా ఉంటుందనీ అర్థమయ్యేలా వివరించాలి. సెక్స్‌కు సంబంధించి వారి అనుమానాలను నివృత్తి చేస్తూనే, కుటుంబ విలువలు, నైతికత గురించి కూడా చెప్పాలి. శృంగారం అనేది ఎవరితో పడితే వారితో చేయకూడదని అలా చేస్తే ఎయిడ్స్, సెక్సువల్ ట్రాన్స్‌మిటెడ్ డిసేజెస్ (ఎస్‌టీడీ) అంటుకుంటాయనీ హెచ్చరించాలి. ఇవన్నీ మనం చెబితే, అబ్బాయి తప్పక సరైన నిర్ణయం తీసుకుంటాడు. అంతేగానీ ఆ వయసులో పిల్లలను కొట్టడం, తిట్టడం చేస్తే పరిస్థితి ప్రమాదకరంగా మారుతుంది.

**మా పాపకు ఏడేళ్లు వచ్చినా రాత్రిపూట ఇంకా పక్క తడుపుతూనే ఉంటుంది. దీని వల్ల నాకు చాలా ఇబ్బందిగా అనిపిస్తోంది. పాపను తీసుకుని ఎక్కడికి వెళ్లాలన్నా ఈ సమస్యవల్లే వెళ్లడానికి నిరాకరిస్తున్నాను. ఈ సమస్యకు పరిష్కారమార్గం చెప్పండి.**

**- వర్షితారెడ్డి, సికింద్రాబాద్**

మీ సమస్య కొత్తేం కాదు. చాలామంది పిల్లలు రాత్రి పక్క తడపడం సర్వసాధారణం. అయితే పిల్లలు పెరుగుతున్నప్పటికీ ఈ సమస్య అలాగే ఉండటం వల్ల సహజంగానే ఆందోళన పెరుగుతుంది. ఇబ్బందిగా కూడా అనిపిస్తుంది. దీనికి పరిష్కార మార్గమేమిటంటే... సాయంత్రం ఆరుగంటల తర్వాత పిల్లలు అదేపనిగా నీళ్ల తాగడం మాన్పించాలి. పగలు నీళ్ల తాగినా వాష్‌రూమ్‌కు వెళ్తారు కాబట్టి సమస్య ఉండదు. సాయంత్రం ఆరు గంటల తర్వాత నీళ్ల తాగడం మాన్పిస్తే, పిల్లలు రాత్రి ఎనిమిది, తొమ్మిది గంటలకు నిద్రపోయినా బ్లాడర్ ఖాళీగా ఉంటుంది కాబట్టి పక్క తడిపే ఛాన్సుండదు. కొన్నాళ్లిలా చేసి చూడండి ఫలితం తప్పకుండా కనిపిస్తుంది.



**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్,
కిమ్స్ హాస్పిటల్

**మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా ప్రశ్నలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.**
**అడ్రస్ : ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, మెయిల్ ఐడి : sunday.aj@gmail.com**

# 'మామ్' శ్రీదేవి



నాలుగేళ్ల చిన్నారి బుడిబుడి అడుగులేస్తూ సెట్స్ మీదికి వచ్చింది. నెత్తిన కిరీటం, నుదుట విభూతి, చేతిలో ఆయుధం. అచ్చంగా కుమారస్వామే! దండం పెట్టుకున్నంత పని చేశారు షూటింగ్ చూడ్డానికొచ్చిన జనాలు. తొలిసారిగా కెమెరా వైపు చూస్తూ... ఆశీర్వదిస్తున్నట్టు చేయి ఊపింది శ్రీదేవి.

'...షాట్ ఓకే!' డైరెక్టరు ప్యాకప్ చెప్పాడు.

పరుగుపరుగున వెళ్లి అమ్మను చుట్టేసుకుంది.

ఆ తేదీ... జులై 7, 1967.

'కందన్ కరుణై' - శ్రీదేవి మొదటి సినిమా

• • •

తప్పు... పెద్దతప్పు...

ఈ రెండిట్లో ఒకటి తప్పనిసరైతే మీరేది చేస్తారు?

- అంటూ మొదలైన సినిమా ట్రెయిలర్ యూట్యూబ్‌లో ఓ సంచలనం. గ్రాఫిక్ మాయాజాలం లేదు. భారీ బడ్జెట్ కాదు. అయితేనేం, ఉద్వేగాలున్నాయి. గుండెల్ని పిండే బంధాలున్నాయి.

విడుదల తేదీ... జులై 7, 2017.

'మామ్' - శ్రీదేవి 300వ చిత్రం.





**కవర్ స్టోరీ**

**మూ**డువందల చిత్రాలు.

యాభై ఏళ్ల సినిమా ప్రయాణం.

యాభై నాలుగేళ్ల జీవితం. అయినా సరే...

సినిమా అభిమానులకు సంబంధించినంత వరకూ ఐదు పదులు పదహారే. శ్రీదేవి వయసు పదహారేళ్లే. 'భలే వారండి!....మీరూ' అంటూ సాక్షాత్తు శ్రీదేవే సున్నితంగా మందలించినా సరే. ఆ నిర్ణయం మారదు. ఈ లెక్కలో తిక్కలేదు. చిక్కని అభిమానముంది.

• • •

ఏబీఎన్, ఎన్డీటీవీ, రిపబ్లిక్ టీవీ... రిమోట్‌తో అంకెలు మారుస్తూ... మహా సీరియస్‌గా ప్రైమ్‌టైమ్ న్యూస్ చూస్తున్న బట్టతల బాబాయిలు కూడా హఠాత్తుగా ఏ తెలుగు ఎంటర్‌టెయిన్‌మెంట్ చానల్ దగ్గరో ఆగిపోతారు. అక్కడ 'జగదేకవీరుడు-అతిలోక సుందరి' ఆడుతూ ఉంటుంది. ఆ నిమిషంలో.... బ్రేకింగ్ న్యూస్ గుర్తుకురాదు. బిజినెస్ అప్‌డేట్స్ ముఖ్యమనిపించవు. ఆ చత్వారం కళ్లు, ఇంద్రజ సౌందర్యాన్ని స్ట్రా లేకుండానే జుర్రుకునే ప్రయత్నం చేస్తుంటాయి. మనసేమో.... టీవీఎస్ మోపెడ్ ఎక్కి కౌమారం వైపు బయల్దేరుతుంది. సింగిల్ స్క్రీన్ థియేటర్లూ, వాలు జడలతో లంగా ఓణీలతో తలొంచుకుని కాలేజీకొచ్చే అమ్మాయిలూ, లేడీస్ వెయిటింగ్ రూమ్ ముందు నుంచీ తలెత్తుకు వెళ్లడమే గొప్పనుకునే అబ్బాయిలూ, సైకిల్ చైన్లతో వీధి పోరాటాలూ, బాక్సాఫీసు సాక్షిగా చిరిగే బనియన్ చొక్కాలూ... ఈస్ట్‌మన్ కలర్‌లో గతమంతా గుర్తుకొస్తుంది.

శ్రీదేవి నోస్టాల్జియా మహారాణి! తొలి ప్రేమకు సాటివచ్చే తీపిగుర్తు. కాకెంగిలిని తలపించే మధుర జ్ఞాపకం. రెక్కల గుర్రమెక్కి




చుక్కల్ని చుట్టొచ్చినంత కమ్మని కల. కాలర్ పట్టుకుని వెనక్కి లాక్కెళ్లే కాలయంత్రం.

• • •

'అమ్మాయి కుందనపు బొమ్మ! ఆ చేయి పట్టుకోవాలంటే పుట్టెడు పుణ్యం చేసుకోవాల్రా మొద్దబ్బాయ్'

'నాకక్కర్లేదు అమ్మమ్మా....'

'పాముజడే అనుకో. గిల్లికజ్జాలాడుతున్నప్పుడు ఎంచక్కా అటూ ఇటూ లాగి ఏడిపించొచ్చురా వెర్రివెంగళం!'

'పాములూ ముంగిసలతో మనకు చుట్టరికమేమిటే? నో ఛాన్స్'

'చక్కగా పాడుతుంది. కర్ణాటక సంగీతంలో గోల్డు మెడలిస్టు కూడా. పండువెన్నెల్లో డాబా మీద పడుకుని నీకిష్టమైన జావళీలు పాడించుకోవచ్చురా నెలతక్కువ వెధవా!'

'పెళ్లి చేసుకునేది కాపురం చేయడానికా, కచేరీలు పెట్టించడానికా...'

'నువ్వు వారంవారం తెచ్చుకుంటావే, అదేదో సినిమా పత్రిక. ఆ అట్టమీద బొమ్మలా... ఎవరబ్బా ఆ పిల్ల? అదేరా, పిచ్చి సన్నాసీ, నిద్దట్లో కూడా కలవరిస్తుంటావే... ముచ్చటైన మొహమూ...మూడక్షరాల పేరూ- ఆ, శ్రీ..దే...వి! అచ్చు శ్రీదేవిలా ఉంటుందనుకో...' - పెళ్లికొడుకు ఎగిరి గంతేస్తాడు. క్షణమైనా ఆలస్యం చేయకుండా... పిల్లాడి తల్లో, ఆ తల్లి తల్లో రెక్కలుకట్టుకుని మరీ పెళ్లికూతురి ఇంట్లో వాలిపోతారు. వీలైనంత తొందరగా ముహూర్తాలు ఖరారు చేసుకుంటారు. ఎంత రుష్యశృంగుడి బాపతు అయినా... శ్రీదేవి పేరు చెప్పగానే, తెగ సిగ్గుపడిపోతూ బాసింగం కట్టుకోవాల్సిందే.

శ్రీదేవిలా ఉండటం, శ్రీదేవిలా నవ్వటం, శ్రీదేవిలా మాట్లాడటం- మూడూ మూడున్నర దశాబ్దాల క్రితం... అందగత్తె అనిపించుకోడానికి కనీస అర్హతలు. అలాంటి అమ్మాయి కోసం బ్రహ్మచారులు తలకిందా కాళ్లపైనా పెట్టి తపస్సు చేసేవారు. అయినా, శ్రీదేవేం త్రీడీ ప్రింటరా? ఎవరికి పడితే వారికి ఆ పోలికలు రావడానికి? బ్రహ్మచారి కుర్రాళ్లకు తత్వం బోధపడేసరికి పుణ్యకాలం కాస్తా గడిచిపోయేది. వయసు బెండకాయలా ముదిరిపోయేది. 'అమ్మాయి శ్రీదేవిలా లేకపోయినా ఫర్వాలేదు పంతులుగారూ... పిల్లపేరు శ్రీదేవి అయితే చాలు' అంటూ పెళ్లిళ్ల పేరయ్యల్ని బతిమాలుకునేవారు. ఆ ఆశా ఆవిరైపోయినప్పుడు, అన్నీ మూసేసుకుని అమ్మానాన్నా వెదికితెచ్చిన బాలాత్రిపురసుందరినో, వీర వేంకట విద్యాలక్ష్మినో బుద్ధిగా పెళ్లి చేసుకుని, ముద్దుగా శ్రీ అనో, దేవీ అనో పిలుచుకుని... ముచ్చటతీర్చుకునేవారు. ఏడాది తిరిగేసరికి కడుపున నలుసు పడితే మాత్రం, అదీ ఆడపిల్ల అయితే మాత్రం... నామకరణోత్సవం రోజున వెండిపళ్లెంలోని బియ్యపు గింజల్లో చూపుడువేలు సుతారంగా రాసేపేరు మాత్రం...

శ్రీ....దే.....వి!

తెలుగుజనం ఆ పేరుకు తేరుకట్టి ఊరేగించారు. దాదాపుగా ప్రతి ఇంట్లోనూ ఓ శ్రీదేవి, ప్రతి క్లాసులో పదిమంది శ్రీదేవులు. టెన్త్ సీ శ్రీదేవి, నైన్త్ బీ శ్రీదేవి, రాంబాబుగారి శ్రీదేవి, సుబ్బాయమ్మగారి శ్రీదేవి! 'బిజినెస్ పెడుతున్నా, కాస్త మంచి పేరేదైనా చెప్పవోయ్?' అని ఏ మిత్రుడో అడగడమే ఆలస్యం! మళ్లీ - శ్రీదేవి బ్యాంగిల్ స్టోర్స్, శ్రీదేవి మ్యాచింగ్ సెంటర్, శ్రీదేవి బ్యూటీపార్లర్... ఆ కథంతా చెప్పుకుంటే అదో భాగవతం, దేవీభాగవతం!



• • •

శివకాశిలో భూచక్రమే కాదు...

చక్రాల్లాంటి కళ్లున్న ఓ చిన్నిపాపా పుట్టింది.

శ్రీదేవి జన్మించింది అక్కడే. తనకి బాల్యమంటే... మేకప్...ప్యాకప్! అంతే. షూటింగ్ గ్యాప్‌లో అమ్మ ఒళ్లో కూర్చుని అక్షరాలు దిద్దుకోవడం. అలసటనిపిస్తే ఓ మూలన ముడుచుకుని పడుకోవడం. ఏ అసిస్టెంట్ డైరెక్టరో వచ్చి లేపగానే కళ్లు నలుపుకుంటూ నేరుగా సెట్స్ పైకి వెళ్లడం. వెళ్లాలనిపించకపోతే, భోరున ఏడ్చేయడం. ప్రొడ్యూసర్ అంకులిచ్చే బిస్కెట్లూ చాక్లెట్లూ లంచంగా తీసుకుని... ఓ నవ్వు నవ్వేయడం. అమ్మో! మహానటే!

శ్రీదేవి బుద్ధిమంతురాలైన పిల్ల. ఓసారి వాళ్లమ్మ పిట్టగోడ మీద కూర్చోబెట్టి... ఇప్పుడే వచ్చేస్తా, కదలకుండా కూర్చో... అని చెప్పి ఇంట్లోకి వెళ్లిపోయింది. పన్లోపడి ఆ విషయమే మర్చిపోయింది. నాలుగైదు గంటల తర్వాత గుర్తొచ్చి గబగబా పరిగెత్తుకొచ్చింది. పిట్టగోడ మీద కదలకుండా కూర్చుని ఉంది శ్రీదేవి.

చిన్నప్పుడు తనకో గండం తప్పింది. కె.ఎస్. ప్రకాశరావు దర్శకత్వంలో వచ్చిన 'నా తమ్ముడు'లో తను చైల్డ్ ఆరిస్ట్. అప్పటికే మలయాళం, కన్నడం, తమిళం తదితర భాషల్లో ఎడాపెడా నటిస్తోంది. ఏదో పని మీద బయటికెళ్తూ, శ్రీదేవి మీద తీయాల్సిన రన్నింగ్‌షాట్ బాధ్యతను, తనయుడు రాఘవేంద్రరావుకు అప్పగించారు. ఇంగ్లిష్ సినిమాలా తీద్దామన్న ఉత్సాహంలో మద్రాసు మౌంట్‌రోడ్ దగ్గర నడిరోడ్డు మీద పరిగెడుతూ రమ్మని పురమాయించారు రాఘవేంద్రరావు. 'డైరెక్టర్ అంకుల్ ఎలా చెబితే అలా చేయాలి సరేనా?' అంటూ అమ్మ చెప్పిన మాట అస్సలు మరచిపోలేదా చిన్నారి. కర్చీఫ్ ఊపగానే... పరిగెత్తుకుంటూ వచ్చింది. అంతలోనే, అట్నుంచి ఓ కారు రివ్వున దూసుకొచ్చింది. వెంట్రుకవాసిలో ప్రాణాపాయం నుంచి బయటపడింది. అదో కుదుపు. మళ్లీ, పదేళ్ల తర్వాత... పద్నాలుగేళ్ల వయసులో ఇంకో కుదుపు. ఈసారి, యాక్సి



డెంట్ చేసింది...శ్రీదేవే! గాయాలపాలైంది... తెలుగు కుర్రాళ్ల గుండెలు. ఆ అందం-చందం, కనుమెరుపు- పెదవివిరుపు... యువతను వెర్రెక్కించాయి. పుస్తకాల అట్టమీద శ్రీదేవే, గుండె ఆనకట్ట మీదా శ్రీదేవే. కలల్లో శ్రీదేవే. కవిత్వాల్లో శ్రీదేవే. 'సిరిమల్లెపూవా సిరిమల్లెపూవా చిన్నారి చిలకమ్మా, నా వాడు ఎవరే, నా తోడు ఎవరే ఎన్నాళ్లకొస్తాడే!' ...పాట యువతరం జాతీయగీతమై కూర్చుంది. సరిగ్గా ఆ దశలో మళ్లీ రాఘవేంద్రరావే రంగంలో దిగారు. ఆయన వెండితెర జెమాలజిస్టు. మెరుపు రాళ్లలోంచి మేలిమి వజ్రాల్ని ఏరితీయగల సౌందర్య బేహారి! 'వేటగాడు'లో ఎన్టీఆర్ పక్కన... కొత్త మొహం కోసం, కొత్త అందం కోసం ఆయన కెమెరా కళ్లు గాలిస్తున్నాయి. ఠక్కున శ్రీదేవి గుర్తుకొచ్చింది. లోగడ 'బూచాడమ్మా బూచాడు...' అంటూ ఎన్టీఆర్ మనవరాలిగా నటించిన అమ్మాయిని తీసుకొచ్చి, మళ్లీ ఆయన పక్కనే కథానాయికగా చూపిస్తారా? ఆ లేతపిందెతో 'ఆకుచాటు పిందె తడిచే...' అంటూ స్టెప్పులేయిస్తారా? - ఇండస్ట్రీ మొత్తం ఓ పక్కా, రాఘవేంద్రరావు మరో పక్కా? మరి ఎన్టీఆర్?? 'ఓ...యెస్' అనేశారు. 'తనకి పద్నాలుగేళ్లయితే, మనకీ పద్నాలుగే బ్రదర్' అంటూ గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశారు. ఆ సినిమా ప్రేక్షకుల్ని ఉర్రూతలూగిస్తున్న సమయానికి రామ్‌గోపాల్‌వర్మ లక్ష్మీకాపూల్‌లోని మీరా థియేటర్‌లో కిక్కిరిసిన ప్రేక్షకుల మధ్యలో ఓ సాధారణ ప్రేక్షకుడు. ఆ తెర దేవత వంక కళ్లప్పగించి చూస్తూ... అంతటి అందాన్ని ఎలా వర్ణించాలా అని తర్జనభర్జనపడుతున్నాడు. అంతలోనే, ఓ ప్రేక్షకుడు సీట్లోంచి లేచి...'నిన్ను పుట్టించినోడికో దండం' అంటూ థియేటర్ మొత్తం ప్రతిధ్వనించేలా అరిచాడు. ఆ మాటలు... ముతకగా ఉన్నా, మహాసత్యంలా గోచరించాయి వర్మకు. ఆ స్టేట్‌మెంట్‌లోని గాఢత భలేగా నచ్చింది. 'గోవిందా గోవిందా'లో అంతే మాస్‌గా... సిరివెన్నెలతో ఓ పాట రాయించుకున్నాడు...'అమ్మ బ్రహ్మదేవుడో, కొంప ముంచినావురో. ఎంత గొప్ప సొగసురో, యాడ దాచినావురో!' అంటూ. నీటి అణువులో ఆక్సిజన్ ఎంతో, హైడ్రోజన్ ఎంతో లెక్కగట్టినట్టు... కవిగారి పక్కన కూర్చుని శ్రీదేవి సౌందర్య ఫార్ములానూ తయారు చేయించాడు. కొన్ని పూలరెక్కలూ ప్లస్ కొన్ని తేనె చుక్కలూ ఈక్వల్ టు శ్రీదేవి అంటూ కొత్త నిర్వచనం చెప్పాడు.

ఎంత రాఘవేంద్రరావు సినిమా అయినా, శ్రీదేవి ఉందంటే... పూలూపళ్లూ అక్కర్లేదు. ఉన్నా, అవన్నీ 'ఎగ్‌స్ట్రాలే'! ఆ నాసికం సంపెంగ పూవు, ఆ బుగ్గలు బంతిపూలు, ఆ కళ్లు తామర పూలు. ఆ పెదాలు పనసతొనలు, ఆ చూపులు చక్కెరకేళీలు. అసలే దేవకన్యలా ఉంటుంది... అందులోనూ దేవకన్య పాత్ర అయితే... జగదేక దర్శకుడికి చేతినిండా పనే! కాబట్టే, '... అతిలోక సుందరి'ని మహాద్భుతంగా చూపించాడు. పువ్వూనవ్వూ పులకించే గాలిలో, నింగీనేలా చుంబించే లాలిలో, తారల్లారా రండే విహారమే... అంటూ శ్రీదేవి మేఘాల మెట్లు దిగి భూదేవి ఇంటికొచ్చేదృశ్యమైతే మహాద్భుతం. అందాన్ని మరింత అందంగా చూపగల దర్శకుడూ అందానికే అందనంత అందగత్తె అయిన నటీ... ఆ ఇద్దరి కాంబినేషన్‌లో ఇరవైనాలుగు సినిమాలొచ్చాయి. ఆ మాటకొస్తే శ్రీదేవి 'డైరెక్టర్స్ ఛాయిస్'! ఆ అభినయాన్ని ఎంత ఖరీదైన కెమెరా అయినా కళ్లప్పగించి చూడాల్సిందే. 'మిగతా సందర్భాల్లో ఫర్వాలేదు. శ్రీదేవి డాన్స్ చేస్తున్నప్పుడు మాత్రం దర్శకుడికి ఊపిరాడదు. ఆమెలోని నాట్యకారిణి అద్భుతమైన భంగిమల్ని ప్రదర్శిస్తూ ఉంటుంది. ఆమెలోని నటి చూపుతిప్పుకోలేని భావాల్ని వ్యక్తం చేస్తూ ఉంటుంది. దేని మీద దృష్టిపెట్టాలో ఓ పట్టాన అర్థం కాదు' అంటాడు - 'మిస్టర్ ఇండియా'కు దర్శకత్వం వహించిన శేఖర్‌కపూర్.

'బ్యాంకాక్‌లో వంటవాడిగా ఉన్నప్పుడు... తోఫా, హిమ్మత్‌వాలా మొదలైన సినిమాలు చూస్తూ అంట్లుతోముకునే వాడిని. ఏదో ఒక రోజు శ్రీదేవితో కలసి నటించాలని కలలుకనే వాడిని' - గుర్తు చేసుకుంటాడు అక్షయ్‌కుమార్.

• • •

శ్రీదేవి...
సూపర్‌స్టార్ స్టార్.
మిగిలినవాళ్లంతా ఒట్టి స్టార్స్.

'నటిని కాబట్టి, ఏదో ఓ సినిమా చేయాలని నేను ఎప్పుడూ అనుకోను. నా పిల్లల్నీ, ఇంటినీ వదిలేసి స్టూడియోలోనే గడపాల్సి వచ్చినా, బాధనిపించనంత గొప్ప కథ అయితేనే అంగీకరిస్తాను'

'ఆహారం విషయంలో జాగ్రత్తగానే ఉంటాను. అదే నా సౌందర్య రహస్యమని చాలామంది అపోహపడుతుంటారు. నా మటుకు నాకు, అందం మనసుకు సంబంధించింది. ఆ మెరుపు సంతోషం లోంచీ, సంతృప్తి లోంచీ వస్తుంది. మనసులో ఉన్నదే మొహంలోనూ ప్రతిఫలిస్తుంది'

'నా విజయం వెనుక చాలామంది ఉన్నారు. వారిలో ముందుగా తలుచుకోవాల్సింది మా అమ్మనే. అమ్మ మా కోసం మొత్తం జీవితాన్ని త్యాగం చేసింది. ఎప్పుడూ అలసిపోయానని చెప్పలేదు. ఏరోజూ కష్టంగా ఉందని అనలేదు. నా కోసం అమ్మ చేసిన త్యాగంలో నేను యాభైశాతమైనా నా పిల్లల కోసం చేశానో లేదో'

'ఏ పాత్రలో అయినా లీనమైపోవడం నా స్వభావం. ఆ పాత్రే నా ప్రపంచం అవుతుంది. ఆ క్యారెక్టర్‌లో నన్నో, మరొకర్నో ఊహించుకోవడం నాకు ఇష్టం ఉండదు'

'కన్నవాళ్లు మరణించాక.. అమ్మ, నాన్న, స్నేహితులు -అన్నీ బోనీకపూర్‌గారే. నా పేరు ప్రస్తావనకు వచ్చిన ప్రతిసారీ ఆయన కళ్లల్లో వెలుగు కనిపిస్తూ ఉంటుందని అంతా చెబుతుంటారు. ఆ మాటా నిజమే. మా పెద్దమ్మాయి తనకు అచ్చంగా నాన్నలాంటి భర్తే కావాలంటోంది'

పది సినిమాల్లోనో పాతిక సినిమాల్లోనో ధగధగా వెలిగిపోయి... ఆ తర్వాత వెలిసిపోయే మామూలు స్టార్స్. మూడొందల చిత్రాల తర్వాత కూడా శ్రీదేవికంటూ అభిమానులున్నారు. మూడొందల ఒకటో సినిమాకూ అవకాశమిచ్చే నిర్మాతలున్నారు. ఆ సినిమా ఎప్పుడు విడుదలవుతుందా అని ఎదురుచూసే ప్రేక్షకులున్నారు. ఆ స్టార్‌డమ్ అయాచితంగా వచ్చింది కాదు. పోరాడి సాధించుకున్నది.

'పదహారేళ్ల వయసు' హిందీలో అట్టర్‌ఫ్లాప్ అయింది. ఆ వైఫల్యం అచ్చంగా సినిమా వైఫల్యమే. శ్రీదేవి వైఫల్యం కాదు. ఆ కథా, ఆ నేపథ్యం ఉత్తరాదివాళ్లకు ఎక్కలేదంతే! దీంతో, మరో అవకాశం ఇవ్వడానికి ఎవరూ ముందుకు రాలేదు. ఈసారీ రాఘవేంద్రరావే పూనుకున్నారు. 'హిమ్మత్ వాలా'లో ఛాన్స్ ఇచ్చారు. జితేంద్ర హీరో. ఆతర్వాత అన్నీ విజయాలే. 'హిమ్మత్ వాలా' దేశవ్యాప్తంగా ఐదు థియేటర్లలో ఏడాది పాటూ ఆడింది. రజనీకాంత్, కమల్‌హాసన్, అమితాబ్, ధర్మేంద్ర, జితేంద్ర, అనిల్‌కపూర్, నాగేశ్వరరావు, కృష్ణ, శోభన్‌బాబు, చిరంజీవి, నాగార్జున, వెంకటేష్... ఇలా బాలీవుడ్, టాలీవుడ్ అగ్రహీరోలందరి సరసనా నటించింది శ్రీదేవి.

అందాల నటి రేఖ స్థానాన్ని రేఖామాత్రం చేసి, శ్రీదేవిని నెత్తినపెట్టుకుంది బాలీవుడ్. తమిళంలోనూ ఆమెది తిరుగులేని స్థానమే. కస్తూరివార్కైతే శ్రీదేవి అంటే వల్లమాలిన ప్రేమ. ఓ దశలో స్పీల్‌బర్గ్ కూడా శ్రీదేవి కోసం ప్రయత్నించాడంటారు. 'అబ్బే... అలాంటిదేం లేదండీ!' అంటారు శ్రీదేవి.

శ్రీదేవి సినిమా షూటింగ్ జరుగుతోందంటే... ఊళ్లకు ఊళ్లు తరలివచ్చిన సందర్భాలు ఉన్నాయి. 'క్షణ క్షణం' సమయంలో అయితే, నంద్యాలలో శ్రీదేవి బసచేసిన లాడ్జీ ముందు ఇరవైవేలమందికి పైగా గుమిగూడారట.

## 'శ్రీ'కారం...

పుట్టినతేదీ : **ఆగస్టు 13, 1963**
తల్లిదండ్రులు: **అయ్యప్పన్, రాజేశ్వరి**
జీవిత భాగస్వామి: **బోనీకపూర్**
పిల్లలు: **జాన్వి, ఖుషీ**
మహాఇష్టం: **ఐస్‌క్రీమ్స్ అంటే! (తినడం కాదు... చిన్నపిల్లలు తింటూ ఉంటే చూడటం)**
వంట: **బొత్తిగా రాదు.**
ఒంటరిగా ఏ ద్వీపానికైనా వెళ్లాల్సి వస్తే... ఏఏ సినిమాల డీవీడీలు తీసుకెళ్తారు?: **అక్కడా సినిమాలేనా, ట్రాక్‌సూట్ మాత్రం తప్పనిసరి.**
కెమెరా ముందుకెళ్తున్నప్పుడు గుర్తుచేసుకునేది: దేవుడిని.
పెద్ద డైలాగులైతే : **బట్టీపట్టేయడమే. ఐదు నిమిషాల్లో రెండు పేజీల స్క్రిప్టు నోటికి వచ్చేస్తుంది. జ్ఞాపకశక్తి ఎక్కువే.**
ఇష్టమైన డ్రస్సు : **చీర**
పెంపుడు శునకం: **కోకో**
నమ్మిన సిద్ధాంతం : **బతుకు, బతకనివ్వు!**


అమ్మానాన్నలతో...


తనదైన కుటుంబంతో...

ఆమెను చూడ్డానికి రాత్రంతా జాగరణ చేశారట. ఆమె కారు వెనకాలే జనం పరుగెడుతున్న దృశ్యమైతే... ఏ అమ్మవారి రథోత్సవాన్నో గుర్తుకు తెచ్చిందట. ఏ నాయికకూ దక్కని గౌరవమిది. ఏ కథానాయకుడికీ తక్కువకాని అభిమానమిది. ఆమెను తపించు, జపించు భక్తులు కోకొల్లలు. 'దేవుడు ఒకే ఒకసారి మంచి మూడ్‌లో ఉన్నప్పుడు ఒక శ్రీదేవిని క్రియేట్ చేశాడు. మిగతా అమ్మాయిలంతా సూపర్‌ఫ్లాప్. నాకు శ్రీదేవి ఓ దేవత' అని భక్తిపూర్వకంగా ప్రకటించాడు రామ్‌గోపాల్‌వర్మ దర్శకేంద్రుడి 'సౌందర్యలహరి'లో.

• • •

శ్రీదేవి కెరీర్‌లో ఘన విజయాలున్నాయి. ఘోర వైఫల్యాలూ ఉన్నాయి. వ్యక్తిగత జీవితంలోనూ అనేక ఒడుదొడుకులు. అయినా, ఎప్పుడూ శ్రీదేవి నిస్పృహకు గురికాలేదు. అనుకోని పరిస్థితుల్లో తల్లి చితికి తానే నిప్పు పెట్టింది. తండ్రి అంత్యక్రియల్ని పూర్తిచేసుకుని నేరుగా షూటింగ్‌కు వెళ్లింది. పెళ్లి విషయంలో ఎన్నో పుకార్లు. ఒక హీరోను ప్రేమించిందనీ, మరో హీరోతో సహజీవనం చేసిందనీ... ఎవరికి తోచినట్టు వాళ్లు కథలు అల్లేసుకున్నారు. ఓ దశలో బోనీకపూర్‌తోనూ విడిపోతున్నట్టు కథనాలు వచ్చాయి. శ్రీదేవి అవుననలేదూ, కాదనలేదూ. ఏదైనా ఎందుకనాలి? దేవకన్య పాత్రలో నటించినా శ్రీదేవీ మనిషే. ఆమెకూ మనసు ఉంది. తన బతుకు తాను బతికే స్వేచ్ఛ ఉంది. ప్రేమ, పెళ్లి, కాపురం... పూర్తి వ్యక్తిగత విషయాలు. చాలామంది తారల్ని బాధించిన ఒంటరితనమే శ్రీదేవినీ ఆవహించింది. తెప్పలుగ చెరువు నిండినప్పుడు బెకబెకమంటూ వచ్చిచేరిన పదివేల కప్పలు... ఒక్కొక్కటే మాయమైపోతున్న సమయంలో బోనీ ఒక్కడే అండగా నిలిచాడు. ఆ సమయానికి శ్రీదేవేమీ 'నాతోడు ఎవరే, నా వాడు ఎవరే...' అని పాడుకునేంత అమాయకురాలు కాదు. ప్రపంచాన్ని చూసింది. మనుషుల్ని చదివింది. అనుభవాల నుంచి చాలా నేర్చుకుంది. అందుకే, బోనీ చేయి పట్టుకుంది.

పెళ్లి తర్వాత పదిహేనేళ్ల పాటు శ్రీదేవి సినిమాలకు దూరంగా ఉంది. పిల్లల పెంపకం మీద శ్రద్ధ పెట్టింది. పెయింటింగ్ పట్ల ఆసక్తి పెంచుకుంది. కళ చాలా సందర్భాల్లో ప్రెషర్ వాల్వ్‌లా పనిచేస్తుంది. అసలే ఆమె అంతర్ముఖి. ఓ పట్టాన బయటపడదు. మనసులోని ఉద్వేగాలన్నీ బొమ్మల రూపంలో వచ్చేవి. ఒకట్రెండు సీరియళ్లలో, టీవీషోలలో కనిపించినా అదంతా తాత్కాలికమే. 'పదిహేనేళ్లూ క్షణాల్లా గడిచిపోయాయి. పిల్లల మధ్య సమయమే తెలియలేదు' అంటారామె. 'అదో కఠిన నిర్ణయం కూడా కాదు. చాలా తేలిగ్గా, అలవోకగా చేసుకున్న తీర్మానమది. నాకు నా పిల్లలు ముఖ్యం. వాళ్ల తర్వాతే ఏమైనా' అని స్థిరంగా జవాబిస్తుంది. 'ఇంగ్లిష్ వింగ్లిష్'తో ఆమెలోని నటి మళ్లీ బయటికొచ్చింది. 'మామ్' తర్వాత 'శ్రీదేవి.20'ను చూడబోతున్నామేమో!

• • •

'మామ్'లో శ్రీదేవిది తల్లి పాత్ర. బయటికెళ్లిన ఆడపిల్ల క్షేమంగా ఇంటికి తిరిగి రావాలని కోరుకునే సగటు మాతృమూర్తి పాత్ర. పాత్రలోనే కాదు, పాత్రధారి శ్రీదేవిలోనూ తన పిల్లల భవిష్యత్తు పట్ల ఏదో తెలియని బెంగ. ఆ మాట ఎప్పుడూ బయటికి చెప్పకపోయినా, ఆ సందిగ్ధం ఎదుటివారికి అర్థం అవుతూనే ఉంటుంది.

పిల్లలు... అమ్మలా, తామూ నటించాలని కోరుతున్నారు. అమ్మ... పిల్లలు తనలా కాకుండా, హాయిగా జీవించాలని కోరుతోంది.

తాను కోల్పోయిందే, తన పిల్లలూ కోల్పోకూడదని ఏ అమ్మ అయినా ఆశిస్తుంది. 'మామ్' శ్రీదేవి కూడా!

**- సండే డెస్క్**



# మిక్చర్ పొట్లం

బొమ్మలు : వెంకట్



## డైమండ్ రాణి

"నిన్న నా శ్రీమతి పుట్టిన రోజు జరుపుకుంది" చెప్పాడు పీతాంబరం.

"అలాగా .. మరి గిఫ్ట్ ఏమిచ్చావ్?" అడిగాడు ఏకాంబరం.

"ఏం కావాలో కోరుకోమంటే, మీరేదైనా కొనివ్వండి కాని అందులో డైమండ్ తప్పనిసరిగా ఉండాలంది" వివరించాడు పీతాంబరం.

"అవును మరి, శ్రీమతా మజాకా .. ఇంతకీ ఏం కొని చ్చావు?" ఉత్సాహంగా రెట్టించాడు ఏకాంబరం.

"ప్లేయింగ్ కార్డ్స్" తాపీగా బదులిచ్చాడు పీతాంబరం.









## అన్నీ మంచి శకునములే...

ఐసీయూలో ఉన్న జోగినాథానికి దినపత్రిక ఇచ్చారు సిబ్బంది.

గబగబా పేజీలు తిప్పి రాశిఫలం చూసుకున్నాడు.

"ఈరోజు మీకు శుభదినం. సుదూర ప్రయాణం. ఖర్చు తక్కువ. పాత మిత్రులను, బంధువులను కలుస్తారు. ప్రయాణానికి ఎలాంటి ఆటంకం కలగదు ... శుభం!"

## 'అతిచిన్న' కథ!




అనగనగా ఓ పసివాడు. చురుకైనవాడు. బోల్డన్ని ఆటలు ఆడుకునేవాడు. ఓ పుట్టినరోజు నాడు వాళ్ల నాన్న ఓ సెల్‌ఫోన్ కానుకగా ఇచ్చాడు. అంతే పసివాడి కథ అయిపోయింది.

(సాంకేతిక బానిసత్వం మీద ఓ సంస్థ ఏర్పాటు చేసిన హోర్డింగ్ మీదున్న 'అతిచిన్న కథ' ఇదే.)

## ఆ రెండు మాటలు



"స్వామీ, మీరు సన్యాసిగా ఎలా మారారు?" అడిగాడు శిష్యుడు.

"గతంలో చీరల షాపులో పనిచేసేవాడ్ని. అక్కడికి వచ్చే ఆడవాళ్లు మాట్లాడిన రెండు మాటలకి జీవితంపై విరక్తి కలిగి ఇలా మారాను" చెప్పాడు స్వామీజీ.

"ఏం మాట్లాడేవారు స్వామీ వాళ్లు?" ఆసక్తిగా అడిగాడు శిష్యుడు.

"1 - ఈ డిజైన్‌లో వేరే కలర్ చూపించు.
2 - ఈ కలర్‌లో వేరే డిజైన్ చూపించు .."
అర్ధనిమీలిత నేత్రాలతో సెలవిచ్చాడు స్వామీజీ.

## ఆరోహణ క్రమం



ఒక స్కూల్లో గ్రూప్ ఫోటో తీయడానికి ఫోటో గ్రాఫర్ని పిలిచారు.

ఫోటోగ్రాఫర్ ఒక్కొక్కరికి రూ.20 అవుతుందన్నాడు. హెడ్ మాస్టర్ పిల్లలు చాలా బీదవారని చెప్పి రూ.10 ఇస్తారని ఒప్పించాడు.

ఫోటోగ్రాఫర్ సరేనన్నాడు.

హెడ్‌మాస్టర్ టీచర్లని పిలిచి "ఒక్కొక్క విద్యార్థి దగ్గర రూ.30 వసూలు చేయమని చెప్పాడు. టీచర్లు పిల్లలతో ఒక్కొక్కరూ రూ. 50 తీసుకురావాలని ఆర్డరేశారు. పిల్లలు వాళ్ల వాళ్ల అమ్మల దగ్గరకు వెళ్లి స్కూల్లో ఫోటోకి రూ.100 అడిగారని చెప్పారు. అమ్మేమో నాన్న దగ్గరకు వెళ్లి పిల్లల గ్రూప్ ఫోటోకి స్కూల్లో రూ.200 అడిగారని చెప్పి వసూలు చేసింది.

# ‘ఓలా’... రోడ్డెక్కిందిలా!

BHAVISH AGGARWAL

**చేతిలో స్మార్ట్‌ఫోన్, దానికో ఇంటర్నెట్ కనెక్షన్ ఉంటేచాలు... ఒకే ఒక్క యాప్‌తో మీరు ఎక్కడున్నా, ఎక్కడికెళ్లాలన్నా ‘ఓలా’ క్యాబ్ నిమిషాల్లో మీ ముందు ప్రత్యక్షమవుతుంది. ట్రాన్స్‌పోర్ట్ రంగంలో ఎన్నో సంచనాలు సృష్టిస్తూ ముందుకు దూసుకెళ్తున్న ‘ఓలా’ క్యాబ్స్ ఆలోచనకు చిన్న వయసులోనే శ్రీకారం చుట్టినవాడు భవిష్ అగర్వాల్ (31)... ‘ఓలా’ క్యాబ్స్ సహ వ్యవస్థాపకుడు, సీఈవో. ప్రతిష్టాత్మమైన ఐఐటీలో చదువుకున్న భవిష్ ఈ రంగంలోకి ఎలా వచ్చాడు? ‘ఓలా’ ప్రారంభంలో గతుకుల రోడ్డును దాటుకుని, విజయాల బాట ఎలా పట్టింది?.... భవిష్ మాటల్లోనే.**

ఒకరోజు పనిమీద బెంగుళూరు నుంచి బండీపూర్‌కు క్యాబ్ మాట్లాడుకున్నారు భవిష్ అగర్వాల్. రేటు కూడా ముందే మాట్లాడుకున్నారు. కానీ డ్రైవర్ రోడ్డు మధ్యలో క్యాబ్ ఆపి, తిరిగి బేరం మొదలెట్టాడు. కాసేపు వాదించిన తర్వాత భవిష్‌కు ఏం చేయాలో పాలుపోలేదు. ఈ లోపు డ్రైవర్ నడిరోడ్డు మీదనే దింపేసి వెళ్లిపోయాడు. ఎర్రటి ఎండలో కాళ్లకు పనిచెప్పక తప్పలేదు. తెలివైనవాడు ప్రతీ సందర్భాన్ని తనకు అనుకూలంగా మలుచుకుంటాడు. ఈ చేదు అనుభవం నుంచే భవిష్‌కు భవిష్యత్ ‘రూటు’ క్లియర్‌గా కనిపించింది. అతడి ఆలోచనలు వంద కిలోమీటర్ల వేగంతో పరుగెత్తాయి.

• • •

లూధియానా (పంజాబ్)లోని ఒక మధ్య తరగతి కుటుంబంలో పుట్టిన భవిష్ బాల్యమంతా అక్కడే గడిచింది. చిన్నప్పటి నుంచి చదువులో చురుగ్గా ఉండేవాడు. గొప్ప గొప్ప వాళ్ల బయోగ్రఫీ పుస్తకాలు బాగా చదివి ఇన్‌స్పైర్ అయ్యేవాడు. అందరిలో ఒకడిగా కాకుండా ఏదో ఒక ప్రత్యేకత సాధించాలని కోరుకునేవాడు. ఇంట్లోవాళ్లు కూడా అతడిని బాగా ప్రోత్సహించేవాళ్లు. తన కలను పండించుకునేందుకు రాత్రింబవళ్లు కష్టపడి చదివి ప్రతిష్టాత్మకమైన ముంబయి ఐఐటీలో సీటు (సీఎస్ఈ) సంపాదించుకున్నాడు. 2008లో ఇంజనీరింగ్ పూర్తయిన వెంటనే మైక్రోసాఫ్ట్‌లో రీసెర్చ్ ఇంటెర్న్‌గా చేరారు భవిష్. ఆ తర్వాత అసిస్టెంట్ రీసెర్చర్‌గా ఎదిగారు. మైక్రోసాఫ్ట్‌లో అతడు పనిచేసింది కేవలం రెండున్నరేళ్లే కానీ సాధించింది ఎంతో ఉంది. అంత తక్కువ సమయంలోనే పరిశోధకుడిగా మూడు వ్యాసాలను అంతర్జాతీయ పత్రికల్లో రాశారు. ఆ వ్యాసాలకు చక్కటి గుర్తింపు లభించింది. అంతేకాదు రెండు పేటెంట్లను కూడా సాధించడం విశేషం. బ్లాగర్‌గా (దేశీటెక్ పేరుతో) మారి తన ఆలోచనలను షేర్ చేసుకునేవారు. ఆ వ్యాసాలన్నీ కూడా టెక్నాలజీకి సంబంధించినవే. అనేక స్టార్టప్ ఐడియాలు అందులో ఉండేవి. సరిగ్గా అదే సమయంలో భవిష్ తన కెరీర్ ‘రూటు’ మార్చుకోవాలనుకున్నారు.

**ఉద్యోగం వదిలి...**

ప్రతిష్టాత్మక కంపెనీ, మంచి జీతం... జీవితం సాఫీగా సాగిపోతోంది. కానీ భవిష్ మదిలో ఎన్నో ఆలోచనలు సుడులు తిరుగుతూనే ఉన్నాయి. ఏదో సాధించాలనే తపన అతణ్ణి ఎక్కడా నిలవనీయలేదు. అందుకే ఒకరోజు ఉద్యోగం మానేస్తున్నానని ఇంట్లో చెప్పారు. అంతా షాక్.. ‘మైక్రోసాఫ్ట్’లో ఉద్యోగం మానేస్తావా? నీకెమైనా పిచ్చా?? అన్నారు. మనిషి చలనజీవి. నిరంతరం ఒకచోటి నుంచి మరోచోటికి తిరుగుతూనే ఉంటాడు. అందుకే ట్రావెల్ ఏజెంట్‌గా మారతానన్నారు. అతడి ఆలోచన కుటుంబసభ్యులెవరికీ నచ్చలేదు. క్రేజీ ఐడియాగా కొట్టిపారేశారు. 2010లో మైక్రోసాఫ్ట్‌లో ఉద్యోగాన్ని వదిలేసిన తర్వాత ఆన్‌లైన్లో తక్కువ దూరం వెళ్లే టూర్స్, హాలిడేస్ టికెట్లు అమ్మేలా కొన్ని ట్రావెల్ ఏజెన్సీలతో ఒప్పందం కుదుర్చుకున్నారు భవిష్. ఒకవిధంగా ఇది చిన్నపాటి స్టార్టప్‌లాంటిదే. తొలి యేడాదే అనుకున్న





పార్ట్‌నర్ అంకిత్‌తో...



మోదీతో...

ఫలితాలను సాధించి అందర్నీ ఆశ్చర్యపరిచారు. సరిగ్గా అదే సమయంలో బెంగుళూరులో జరిగిన సంఘటనతో తనలాగే ఎంతోమంది ప్రయాణికులు అలాంటి సమస్యలనే ఎదుర్కొంటున్నారని గ్రహించారు. కష్టమర్లకు చికాకు లేని, చక్కని ప్రయాణ అనుభూతిని అందించగలిగితే తప్పకుండా రవాణారంగంలో భవిష్యత్తు ఉంటుందనే నిర్ణయానికొచ్చారు. అప్పుడు భవిష్ వయసు కేవలం 25 ఏళ్ల మాత్రమే. అంత చిన్న వయసులోనే తన ఆలోచనకు ఒక రూపం ఇచ్చేందుకు అంకిత్ భాటిని కలిశారు.

**ఇద్దరు మిత్రులు ...**

ఐఐటీ ముంబయ్‌లో మెకానికల్ ఇంజనీరింగ్ చదివిన అంకిత్‌కు భవిష్ ఐడియా నచ్చింది. టెక్నికల్ సపోర్టు ఇచ్చేందుకు సరేనన్నాడు. పార్ట్‌నర్‌గా చేరేందుకు ఒప్పుకున్నాడు. 2010 డిసెంబర్‌లో వారిద్దరూ కలిసి 'ఓలా' క్యాబ్స్‌కు శ్రీకారం చుట్టారు. 'ఓలా'కు భవిష్ సీఈవో అయితే, అంకిత్ సీటీవో (చీఫ్ టెక్నాలజీ ఆఫీసర్). ట్రాన్స్‌పోర్ట్‌కు, టెక్నాలజీని జోడిస్తే అద్భుతాలు చేయొచ్చని వారిద్దరూ బలంగా నమ్మారు. ఆ నమ్మకంతోనే ముందడుగు వేశారు. అయితే మొదట్లో క్యాబ్‌లను సమకూర్చుకోవడం, డ్రైవర్లను సమన్వయం చేయడం భవిష్‌కు కష్టంగా ఉండేది. వారి నమ్మకాన్ని చూరగొనేందుకు చాలా కష్టపడాల్సి వచ్చింది. కానీ ఆలోచన కొత్తగా, సృజనాత్మకంగా ఉండటంతో అందరికీ తెగ నచ్చేసింది. సొంతంగా ఒక్క కారు కూడా కొనకుండానే, టాక్సీడ్రైవర్లను టెక్నాలజీ పరిధిలోకి తీసుకొచ్చి, కాల్‌సెంటర్ ద్వారా బుకింగ్స్‌కు తగ్గట్టుగా క్యాబ్‌లను ఆపరేట్ చేస్తూ సరికొత్త చరిత్రకు తెరలేపారు. దాంతో 'ఓలా'లో పెట్టుబడులు పెట్టేందుకు చాలామంది ముందుకొచ్చారు. ఈ లోపు స్మార్ట్‌ఫోన్స్ కూడా అందుబాటులోకి రావడంతో 'ఓలా' యాప్ పాపులరయ్యింది. యాప్ ద్వారా క్యాబ్ బుక్ చేసుకోవడం అందరికీ సులువైంది. ప్రయాణికుల అవసరాలకు అనుగుణంగా ఎప్పటికప్పుడు ప్రణాళికలు రూపొందిస్తూ (క్యాష్‌లెస్ రైడ్స్, ఫ్రీ వైఫై, ఓలా మనీ వంటివి), వారికి అత్యంత చవక ధరలకే క్యాబ్ ప్రయాణాన్ని అందుబాటులోకి తేవడంతో కేవలం ఐదేళ్లలో భవిష్ 'ఫోర్బ్స్' ధనవంతుల జాబితాలో స్థానం సంపాదించుకున్నారు. ప్రస్తుతం 110 నగరాల్లో 6 లక్షలకు పైగా క్యాబ్‌లు 'ఓలా' నెట్‌వర్క్‌లో ఉన్నాయి. 2014 నుంచి ఆటోలను కూడా 'ఓలా' నెట్‌వర్క్ పరిధిలోకి తీసుకొచ్చారు భవిష్. తొలుత బెంగుళూరులో ప్రారంభమైన 'ఓలా' ఆటోలు ఆ తర్వాత ఢిల్లీ, పుణే, హైదరాబాద్, కోల్‌కతా, విశాఖపట్టణం వంటి 73 నగరాలకు విస్తరించాయి. ప్రతీరోజూ సుమారు 1 లక్ష 50 వేల బుకింగ్స్‌తో మార్కెట్‌లో 60 శాతం వాటాను కలిగి ఉన్న 'ఓలా'ను ప్రతీ ఒక్కరికి అందుబాటులోకి తీసుకొచ్చేందుకు భవిష్ పథకరచన చేస్తున్నారు.

- ఆపిల్ వ్యవస్థాపకుడు, సీఈవో స్టీవ్‌జాబ్స్ బయోగ్రఫీ భవిష్ ఫేవరేట్ పుస్తకం.
- ఫోర్బ్స్ '30 అండర్ 30'లో స్థానం సంపాదించారు.
- సైక్లింగ్, స్క్వాష్ ఆడటం, ఫోటోగ్రఫీ అంటే ఇష్టం. ఫోటోబ్లాగ్ కూడా ఉంది.
- 'ఓలా కేఫ్' యాప్ ద్వారా కొన్ని నగరాల్లో ఫుడ్ డెలివరీ కూడా చేస్తున్నారు.
- 'హలో'ను స్పానిష్‌లో 'హోలా' అంటారు. అదే 'ఓలా' (హెచ్ సైలెంట్)గా మారిందంటారు.

**'2 స్టేట్స్' ప్రేమ...**

పనిలో ఎంత బిజీగా ఉన్నా ఒకమ్మాయిని కలిసేందుకు మాత్రం భవిష్ సమయం కేటాయించేవారు. ఆమే రాజ్యలక్ష్మి. భవిష్ ప్రియురాలు. చాలాకాలం ఆమెతో ప్రేమలో ఉన్న భవిష్ ఆ తర్వాత ఇరువర్గాలవారిని (రాజ్యలక్ష్మి తమిళమ్మాయి) ఒప్పించి పెళ్లిచేసుకున్నారు. మిలియనీర్ అయినప్పటికీ ఆర్భాటంగా కాకుండా కేవలం సన్నిహితులు, స్నేహితుల సమక్షంలోనే రాజ్యలక్ష్మిని భవిష్ వివాహం చేసుకోవడం విశేషం. విద్యాధికురాలైన రాజ్యలక్ష్మి ఒకవైపు ఇంటిపనులు చక్కదిద్దుతూనే భర్తకు చేదోడు వాదోడుగా ఉంటుంది. "సింపుల్ లైఫ్ అంటేనే నాకిష్టం. ఇప్పటికీ ఎక్కడికైనా వెళ్లాలంటే క్యాబ్‌లోనే వెళ్తా. సొంత కారు కన్నా అతి తక్కువ ఖర్చుకే సౌకర్యవంతమైన ప్రయాణాన్ని ఎవరైనా ఇష్టపడతారు కదా" అంటున్న భవిష్ తన సక్సెస్ సీక్రెట్‌ను ఒక్క మాటలో చెప్పమంటే ఇలా అంటారు.

'నమ్మకం, భద్రత ఇవి రెండే రవాణారంగంలో అతి ముఖ్యమైన అంశాలు. టెక్నాలజీని ఉపయోగించుకుని ఈ రంగంలో ముందుకు దూసుకెళ్తున్నాం అంతే'. దటీజ్ 'ఓలా' భవిష్! 

క్రైమ్ స్టోరీ

# నేర 'చిత్రం'!

**జైల్లో వేశారు లాయిడ్‌ని.**
**సెల్లో ఆంథోనీని చూశాడతను.**
**"ఏం కేసు?"**
**"డ్రగ్ కేసు, నీది?"**
**"నాదీ అదే"**
**దోస్తులై పోయారు. రోజంతా కబుర్లతో కాలక్షేపం చేశారు. లాయిడ్ బాగా నచ్చాడు ఆంథోనీకి. లాయిడ్ అప్పుడే తప్పించుకునే ప్లానేస్తున్నాడు గనుక...**
**"నీతో...రావచ్చా...?" అన్నాడు.**

"నేను లిఫ్ట్ ఇస్తేగా"
"ఇస్తే పనికొస్తాగా "
"పనికొచ్చే గ్యాంగా?"
"రివేరా -13 ఒకప్పుడు, ఇప్పుడు ఇండిపెండెంట్"
నమ్మలేనట్టు చూశాడు లాయిడ్, "రివేరా -13 వేరే ఊళ్ళో కదా?"
"ఆ ఊళ్ళోనే అప్పుడున్నా. చూడూ, డ్రగ్ బిజినెస్‌లో మా అమ్మా చెల్లీ ఉన్నారు, నువ్వు కూడా కలిస్తే మనం ఫ్యామిలీ"
లాయిడ్ ఆలోచనలో పడి, "లేదు, రివేరా-13 మెంబర్ల మీద మర్డర్ కేసులున్నాయి, అలాంటి వాళ్ళతో నేను కలవను" అన్నాడు.
"నా మీద కేసులెక్కడివీ, మర్డర్ చేసినా కూడా!"
"మర్డర్ చేశావా!" లాయిడ్ నోరు తెరిచేసరికి, నాలిక్కర్చుకున్నాడు ఆంథోనీ.

• • •

ఏడేళ్ళ క్రితం -
ఊరి బయట లిక్కర్ స్టోర్ దగ్గర ఫోన్ చేసుకోవడానికి వచ్చాడు జాన్. హైవే మీద పికప్ వ్యాను ఆగింది. వ్యానులోంచి దిగాడు ఆంథోనీ. పే ఫోన్ దగ్గరికెళ్ళి కాల్ చేసుకుంటున్నాడు జాన్. అతడి దగ్గరి కెళ్ళి ఆంథోనీ, "ఏ గ్యాంగో మన్ది?" అని అడిగాడు.
"పీనట్ గ్యాంగ్ మ్యాన్, పీనట్ గ్యాంగ్!"
"పీనట్సే న్యూసెన్స్!" అని రివాల్వర్ తీసి ఢామ్మని పేల్చాడు ఆంథోనీ. ఇంకా పేలుస్తూ పరుగెత్తుకెళ్ళి రెడీగా వున్న పికప్ వ్యాను ఎక్కేశాడు. క్షణాల్లో అదృశ్యమైంది వ్యాను. రక్తం మడుగులో పడి కొట్టుకుంటున్నాడు జాన్.

• • •

"అప్పుడా ఊళ్ళో దొరక్కుండా, వెళ్ళి వెళ్ళి ఈ ఊళ్ళో ట్రాఫిక్కి దొరికా!"
"ఎలా ? ఎప్పుడు?"
"మూడేళ్ళయింది... నా కారాపారు ట్రాఫిక్ పోలీసులు. మనదగ్గర డ్రైవింగ్ లైసెన్సు ఉంటేగా? ఫైన్ వేసి తీసికెళ్ళి ఫోటోలు తీశారు"
"ఫోటోలెందుకు?"
"ఫేసు చూస్తే తెలిసిపోతోందిగా, అందుకని. బట్ట లిప్పించి ఫోటోలు తీశారు"
"అదేంటి?"
"మా స్ట్రీట్‌గ్యాంగ్స్ పచ్చ బొట్లేసుకుని తిరుగుతుంటారు కదా, అందుకని"
"నీకూ ఉందా పచ్చబొట్టు?"
"ఓ ఎస్, చూస్తావా? కానీ బాస్, నేను సీనంతా చూపించినా కూడా ట్రాఫిక్ వాళ్ళకి బల్బే వెలగలేదు!"
"ఏదీ చూపించు?"
షర్టు విప్పి చూపించాడు ఆంథోనీ.
దిగ్భ్రాంతిగా చూశాడు లాయిడ్. ఆంథోనీ ఛాతీ మీద మర్డర్ సీనంతా పచ్చ బొట్టు పొడిపించి వుంది...
"ఈ పైన చూశావా, రివేరా కిల్స్ అని టైటిల్ పెట్టా. ఈ టైటిల్ కింద సీను. ఇది లిక్కర్ స్టోర్. ఈ స్టోర్‌కి ఇక్కడ కన్పిస్తున్నాయా- ఇవి క్రిస్మస్ లైట్లు. ఇదిగో ఇటు పక్క రోడ్లో స్ట్రీట్ లైటు చూశావా? ఇదంతా యాక్చువల్ సీన్, కల్పితం ఏదీ లేదు. ఇదిగో ఇక్కడ పీనట్‌గాడు బుల్లెట్స్ తగిలి పడిపోతున్నాడు.... ఇటు పైన కనపడుతోందా? ఇది హెలికాప్టర్. ఫైరింగ్ చేస్తూ వచ్చేస్తోంది. గ్రాండ్‌గా వుండాలని హెలికాప్టర్ పెట్టా, ఇదొక్కటే కల్పితం. నా డైరెక్షన్లో మా గ్యాంగ్ గ్రాఫిక్ ఆర్టిస్టు తీర్చిదిద్దాడు దీన్ని- రివేరా లాటినో స్ట్రీట్ గ్యాంగ్- ఎలా వుంది?"
"బుర్ర తిరిగిపోతోందనుకో"
"అదీ మనమంటే! ఇక నీతో రావచ్చా?"
"ఆంథోనీ, జస్ట్ ఒక విషయం చెప్పు నాకు. దీంతో నువ్వు బుక్కయితే నీ డిఫెన్స్ ఏంటి? నీ ఒప్పుకోలు వాంగ్మూలం కాదా ఈ బరితెగింపు బొమ్మ?"
హాయిగా నవ్వాడు ఆంథోనీ, "ఆ కేసెప్పుడో క్లోజ్ చేశారు బాస్. కోల్డ్ కేసు కింద మార్క్ చేసి మర్చేపోయారు. ఎవడు చంపాడో, ఎటు వెళ్ళాడో తెలిస్తేగా? మన పనితనం అలా వుంటుంది. ఈ బొమ్మ ఎవరైనా చూస్తే కూడా హాలీవుడ్ పిచ్చోడనే అనుకుంటారు"
"బొమ్మ ఫోటోలు తీయించి పోలీసులు ఉంచుకున్నారుగా"
"సరే బాస్, ప్లానేంటి చెప్పు. మనం ఎస్కేప్ అవడానికి ఎన్ని రోజులు పడుతుంది?"
"ఆంథోనీ, నేను రిమాండ్‌లో ఉన్నాను. నన్నిక్కడికి తెచ్చే ముందు ఇంటరాగేట్ చేశారు. వేరే ఆఫీసర్ కొన్ని ఫోటోలు చూస్తూ కూర్చున్నాడు..."
"ఏంటీ, ఫోటోలా!" ఇంతెత్తున ఎగిరాడు ఆంథోనీ.

• • •

పోలీసాఫీసర్ కెవిన్ రికార్డులు పరిశీలిస్తూ బిజీగా ఉన్నాడు. నేరగాళ్ళ ఫోటోలు చూస్తూ, ఒక ఫోటో దగ్గర ఆగిపోయాడు. దాన్నే ఆసక్తిగా చూశాడు. ఛాతీ మీద పచ్చబొట్టు పొడిపించుకున్న ఆ క్రిమినల్ విచిత్రంగా అన్పించాడు. ఈ బొమ్మేమిటా అని చూస్తూంటే, అందులో లిక్కర్ స్టోర్, ఆ ఏరియా, ఆ మర్డర్ సీనూ అతణ్ణి ఉక్కిరిబిక్కిరి చేశాయి- "ఏడీ వీడు... ఎక్కడా?" అని అరిచాడు.

• • •

"ఐతే నా పనై పోయిందా!"
'ఎప్పుడో అయిపోయింద'ని సెల్ తీసి కాల్ చేయసాగాడు లాయిడ్.
"కాల్ ఎవరికి?"
"నాపని కూడా అయిపోయింది"
"అంటే నువ్వూ..."
" నేనే...నువ్వు మర్డర్ చేసినప్పుడు ఆ ఊళ్ళో సార్జంట్‌ని. ఇప్పుడు ఇక్కడ లాస్ ఏంజిలిస్‌లో హోమిసైడ్ సార్జంట్‌ని. నా పూర్తి పేరు కెవిన్ లాయిడ్. నీ ఖర్మ కాలి నీ ఛాతీ మీద బొమ్మే చూశాను స్టేషన్లో"
అంటూంటే ఆంథోనీ నోట మాట రాక బిగుసుకుపోయాడు ఛాతీ పట్టుకుని.

**- సికిందర్**








# వారిదే హవా!

రుతుపవనాలు కేరళ నుంచి తెలుగు రాష్ట్రాలకు తాకినట్టే, తెలుగుతెర మీద ప్రతీ యేడాది సందడి చేసేది మలయాళీ భామలే. మొన్నటి రేవతి, శోభనల నుంచి నిన్నటి అసిన్, నయనతార, నిత్యామీనన్‌ల దాకా దక్షిణాదిన వారికే అగ్రతాంబూలం. నివేదా థామస్, అనుపమ పరమేశ్వరన్, అనూ ఇమాన్యుయేల్, మాళవికా నాయర్, కాథరిన్ టెస్రా... లేటెస్ట్‌గా టాలీవుడ్‌లో సందడి చేస్తూ బిజీ అవుతున్నారు.



## గోపీచంద్‌కు జోడీ!

డైరెక్ట్‌గా దుబాయి నుంచి దిగుమతి అయినప్పటికీ అనూ ఇమాన్యుయేల్ నాన్న కేరళవాసి. ఆరేళ్ల క్రితం 'స్వప్నసంచారి' అనే మలయాళం సినిమాలో చైల్డ్ ఆర్టిస్టుగా చేసిన అనూ 2016లో హీరోయిన్‌గా మారింది. తెలుగులో నాని సరసన 'మజ్ను'లో మెరిసిన ఈ కేరళ బ్యూటీ ఇటీవల 'కిట్టు ఉన్నాడు జాగ్రత్త'లో కూడా కనిపించింది. ఒడ్డూపొడవు బాగుండటంతో గోపీచంద్ సరసన 'ఆక్సిజన్'లో ఛాన్స్ దక్కించుకుంది. తమిళంలో విశాల్ సరసన కూడా ఓ సినిమా చేస్తోంది.



## బంపరాఫర్!

నాని 'జెంటిల్మన్' సినిమా ద్వారా తెలుగుతెరకు పరిచయమైన నివేదా థామస్ మలయాళంలో చైల్డ్ ఆర్టిస్టుగా అరంగేట్రం చేసింది. ఆ తర్వాత 'ప్రణయం' సినిమా ద్వారా హీరోయిన్‌గా మారి, తమిళ తెర మీదుగా తెలుగులోకి వచ్చింది. 'నిన్నుకోరి'లో మరోసారి నానితో జతకట్టిన నివేదాకు ఈ యేడాది బంపరాఫర్ దక్కింది. ఎన్టీఆర్ సరసన 'జై లవకుశ'లో హీరోయిన్‌గా ఛాన్స్ కొట్టేసింది. కమలహాసన్ కూతురుగా 'పాపనాశనం' (తమిళంలో 'దృశ్యం' రీమేక్)లో అందరి ప్రశంసలు అందుకున్న నివేదా థామస్ ప్రస్తుతం మూడు భాషలను కవర్ చేస్తూ దూసుకుపోతోంది.



## మోడలింగ్ నుంచి...

పూరీజగన్నాథ్ 'ఇద్దరమ్మాయిలతో...' సినిమాలో కాథరిన్ ట్రెసాను ఇప్పుడిప్పుడే ఎవరూ మర్చిపోరు. బెంగళూరులో చదువుకున్న కాథరిన్ తొలుత నల్లీ సిల్క్స్, చెన్నై సిల్క్స్‌కు మోడల్‌గా ఉంది. కన్నడంలో ఒక సినిమా, మలయాళంలో రెండు సినిమాలు చేసిన తర్వాత నీలకంఠ 'చమ్మక్‌చల్లో' ద్వారా తెలుగుతెరకు పరిచయమైంది. 'పైసా', 'ఎర్రబస్సు', 'రుద్రమదేవి', 'సరైనోడు' సినిమాల్లోనూ ప్రూవ్ చేసుకుని, ప్రస్తుతం తేజ తీస్తున్న 'నేనే రాజు నేనే మంత్రి'తో పాటు గోపీచంద్ సరసన 'గౌతంనంద'లో కూడా మెరవనుంది.



## ఎవరా హీరో?

మాళవిక నాయర్ పుట్టింది ఢిల్లీలోనైనా ఆ తర్వాత వారి ఫ్యామిలీ కేరళకు షిఫ్ట్ అయ్యింది. కొచ్చిలో చదువుకున్న మాళవిక తొలుత సహాయ పాత్రలకే పరిమితమైంది. 2013లో 'బ్లాక్ బటర్ ఫ్లై' ద్వారా గుర్తింపు లభించింది. దాంతో 'పకిడ', 'కుకూ' తమిళ సినిమాల్లో వరుసగా ఆఫర్లు వచ్చాయి. 'ఎవడే సుబ్రమణ్యం'లో ఆనంది పాత్ర ద్వారా తెలుగువారికి దగ్గరైన మాళవిక ఖాతాలో 'కళ్యాణవైభోగమే' హిట్ కూడా చేరింది. ప్రస్తుతం తమిళ సినిమాతో బిజీగా ఉన్నప్పటికీ, త్వరలోనే తెలుగులో ఒక పెద్ద హీరో సరసన నటిస్తున్నట్టు ఊరిస్తోంది.



## రెండు హిట్లు...

నాటకరంగం నుంచి సినిమాల్లోకి వచ్చిన అనుపమ పరమేశ్వరన్ తొలిచిత్రం 'ప్రేమమ్' మలయాళంలో సూపర్‌హిట్ అయ్యింది. ఆ వెంటనే ఆమె త్రివిక్రమ్ కంట్లో పడింది. 'అఆ' సినిమా ద్వారా తెలుగుతెరకు పరిచయమైన అనుపమ 'శతమానంభవతి'తో రెండో హిట్‌ను తన ఖాతాలో వేసుకుంది. చూడటానికి అచ్చ తెలుగు అమ్మాయిలా కనిపించే ఈ మలయాళీ ముద్దుగుమ్మ సోషల్‌నెట్‌వర్క్‌లో తెగ యాక్టివ్‌గా ఉంటుంది.

# చిటికెలో... గుటకేస్తూ...




## కాపీ కొట్టడం తేలిక...

గరిటె తిప్పడం రానివాళ్లు, వంట చేయాల్సివస్తే నానా తంటాలూ పడతారు. తప్పనిసరి పరిస్థితుల్లో యూట్యూబ్ వీడియోలనో వంట పుస్తకాలనో చూసి కాపీ కొడుతూ వంట చేసుకుంటారు. ఈ 'కుకింగ్ గైడ్ అప్రాన్' మీ దగ్గరుంటే నెట్ లేకపోయినా, వంటల పుస్తకాలు దొరక్కపోయినా హాయిగా వండుకోవచ్చు. ఎందుకంటే దీనిపైనే రకరకాల వంటల వివరాలు ముద్రించి ఉంటాయి. వాటిని చదువుతూ వండేయొచ్చు. అస్సలు వంట చేయడం రాని వారికోసం ప్రత్యేకంగా రూపొందించిన ఈ అప్రాన్ పైన గుడ్లు ఉడికించడం, అన్నం వండడం వంటి బేసిక్స్‌తో పాటు మరికొన్ని సులభమైన వంటల్ని చేసే విధానాలూ ఉంటాయి. కిచెన్ మొహమే చూడని వారికి ఇదో మంచి బహుమతి. ఈ అప్రాన్ తొడుక్కోగానే షెఫ్ అయిపోవచ్చు.

## పక్కాగా కొలిచి వేయండి...

వంటల్లో నూనె, నెయ్యి వేయాల్సివచ్చినప్పుడు చాలా జాగ్రత్తగా ఉండాలి. అతిగా వాడితే ఆరోగ్యానికి మంచిది కాదు. అలా అని, తక్కువ పడితే రుచీ బాగుండదు. చెంచాతో పక్కాగా కొలిచి వేయాలంటే అస్సలు కుదరదు. ఈ 'స్మార్ట్ కిచెన్ ప్రెస్ మెజర్ బాటిల్' వంటింట్లో ఉంటే , ఎంత పరిమాణంలో కావాలంటే అంతే పరిమాణంలో తేలికగా కొలిచి మరీ వాడుకోవచ్చు. బాటిల్‌కి ఉండే బటన్‌ను నొక్కితే, మూత భాగంలోకి కావలసినంత నూనె మాత్రమే చేరుతుంది. దాన్ని కొలిచేందుకు గుర్తులు కూడా ఉంటాయి. వాటి ఆధారంగా ఎక్కువా, తక్కువా కాకుండా పక్కాగా అవసరమైనంతే వాడుకోవచ్చు.



## తిప్పే తిప్పలు తప్పిస్తుంది...



కొన్ని రకాల స్వీట్లు, వంటలూ చేసేప్పుడు ఆ పదార్థం మాడిపోకుండా... గట్టిపడకుండా గరిటెతో తిప్పుతూనే ఉండాలి. అలా చాలాసేపు తిప్పడం ఎవరికైనా కష్టంగానే ఉంటుంది. ఇటువంటి ఇబ్బందులను దూరం చేస్తుందీ 'పాట్ మిక్సింగ్ డివైస్'. బ్యాటరీతో నడిచే దీన్ని ఆన్ చేసి గిన్నెలో పెడితే, పదార్థం గట్టిపడకుండా తిప్పుతూనే ఉంటుంది. కలపడం పూర్తయ్యాక బటన్ ఆఫ్ చేస్తే సరి.



## సగం ఇక భద్రం...

సగం కోసిన పండ్లనూ, కూరగాయలనూ భద్రపరచడం చాలా కష్టం. ఫ్రిజ్‌లో పెట్టినా కూడా... పైన నల్లని పొరలా ఆవరించి, కొద్ది రోజుల్లోనే పూర్తిగా పాడైపోతాయి. ఈ 'కవర్‌బ్లబ్బర్ రీయూజబుల్ ఫుడ్ కవర్' కనుక ఉంటే, సగం వాడిన వాటిని కూడా తాజా వాటిలా భద్రపరచవచ్చు. పారదర్శకంగా పాలిథిన్ కవర్‌లా చుట్టుకునే ఈ మెత్తని ఫుడ్ కవర్ పదార్థాలపైకి గాలి, తేమ చేరకుండా బిగుసుకు పోతుంది. కొన్ని రోజుల వరకూ తాజాగా ఉంచుతుంది.

## ఒకేసారి రెండూ...

'బీచ్ బ్రేక్‌ఫాస్ట్ సాండ్‌విచ్ మేకర్' ... ఒకేసారి రెండు రకాల వంటలు చేయడానికి వీలుకల్పిస్తుంది. సాధారణంగా సాండ్‌విచ్ మేకర్లపై ఒకసారి ఒక రకమైన వంటను చేయడానికి మాత్రమే వీలవుతుంది. అంటే, రెండు వంటలు చేసుకోవాలంటే, ఎక్కువ సమయం పడుతుంది. ఈ పరికరం కనుక ఉంటే, బాగా ఆకలి వేసినప్పుడు నిమిషాల్లో రెండురుచుల్ని వండుకుని హాయిగా తినేయొచ్చు. ఒకదాంట్లో బ్రెడ్‌ను బేక్ చేస్తూనే, మరోదాంట్లో గుడ్డు ఆమ్లెట్ వేసుకోవచ్చు. ఎక్కువగా విహారయాత్రలు చేసేవారికి బాగా ఉపయోగపడుతుందీ సాండ్‌విచ్ మేకర్.





# నోట్లోంచి... నోట్లూ రాల్తాయి!

**ఒళ్లొంచి పనిచేయాల్సిన పన్లేదు. బుర్రపెట్టి ఆలోచించాల్సిన అవసరం లేదు. డబ్బు పెట్టి రిస్కు తీసుకోవాల్సిన బాధ లేదు. ఓ మాట చాలు. మహా అయితే, ఓ ఫోన్ నంబరు ఇస్తే సరిపోతుంది. మీ ఖాతాలో డబ్బో నజరానాలో పడిపోతాయి. మాటసాయానికి ఇప్పుడు మా గొప్ప మార్కెట్ ఉంది.**

"సాహసం శాయరా డింభకా.. రాకుమారి వరించేను" ..అంటుంటాడు 'పాతాళభైరవి' సినిమాలో మాంత్రికుడు.

"మాట సాయం శాయరా డింభకా.. ధనలక్ష్మి వరించేను".. అంటున్నాయి ఇప్పుడు చాలా సంస్థలు.

అదేనండీ.. 'మా బ్యాంకు క్రెడిట్‌కార్డును రిఫర్ చేయండి.. రూ.2 వేలు పొందండి' తరహా రిఫరల్స్ గురించే మేం చెప్తున్నది!!

ఈ మధ్యే ప్రధాని నరేంద్ర మోదీ ఆవిష్కరించిన భీమ్ యాప్ గుర్తుందా? దాన్ని రిఫర్ చేసినవారికి నగదు బహుమతి ప్రకటించారు. ప్రభుత్వం ఈ తరహా స్కీమ్ పెట్టడం ఇదే మొదలుగానీ.. ఇలాంటి రిఫరల్ కార్యక్రమాలు మన నిత్యజీవితంలో భాగమై చాలాకాలమైంది. దేశంలోని ప్రముఖ బ్రాండ్లు, సూపర్‌మార్కెట్‌.. వస్త్రదుకాణాలు.. క్యాబ్ సర్వీసుల వంటివి దీన్ని ఎప్పటినుంచో పాటిస్తున్నాయి.

**క్యాబ్ రిఫరల్స్**

ఉబెర్‌దోస్త్.. మీకు తెలిసిన డ్రైవర్లను ఉబెర్‌కు పరిచయం చేసి డబ్బులు పొందే రిఫరల్ స్కీమ్ ఇది. మీరు పరిచయం చేసిన డ్రైవర్ 120 రోజుల్లో నిర్ణీత ట్రిప్పులు వేస్తే చాలు. మీ ఖాతాలోకి రూ.3000 నుంచి రూ.5000 దాకా వచ్చి పడతాయి. అలాగే, ఉబెర్ రైడ్‌ను మీ స్నేహితుడికి రిఫర్ చేస్తే తర్వాత ఆ క్యాబ్‌ల్లో మీరు బుక్‌చేసే మూడు ట్రిప్పులకు రూ.50 చొప్పున రాయితీ లభిస్తుంది. మీకు మాత్రమే కాదు.. మీ ఇన్విటేషన్‌ను అంగీకరించి ఆ కోడ్‌ను వాడిన మీ మిత్రుడికి కూడా అదే ప్రయోజనం లభిస్తుంది. ఓలా కూడా ఇలాగే కొత్త కస్టమర్‌కు, వారిని రిఫర్ చేసిన వారికి రూ.50 చొప్పున రాయితీ ఇస్తోంది.

**ప్రయాణ సంస్థలూ..**

ప్రయాణాలు చేసేవారికి ఉపయోగపడే గోఐబిబో వంటి ట్రావెల్ కంపెనీలు కూడా తమ యాప్స్ ద్వారా రిఫరల్ స్కీములను నిర్వహిస్తున్నాయి. గోఐబిబో ప్రత్యేక స్కీమ్ 'గోక్యాష్'లో మీరు సైన్ -ఇన్ అయితేనే రూ.1000 మీ వాలెట్‌లోకి వస్తాయి. దాన్ని ఎంత మందికి సిఫారసు చేస్తే అంత సొమ్ము. అంతే కాదు.. గోఐబిబో మీ కాంటాక్ట్ నంబర్లతో సింక్ అవుతుంది. ఆ నంబర్లలోని ఏదైనా నంబర్ నుంచి బుకింగ్ జరిగితే మీ ఖాతాలో రూ.50 విలువైన గోక్యాష్ పడుతుంది. ఒక్కో 'గోక్యాష్' ఒక రూపాయితో సమానం. కాకపోతే ఈ గోక్యాష్ వాలెట్‌లో గరిష్ఠంగా రూ.10 వేలు మాత్రమే ఉంటాయి. ఎప్పటికప్పుడు వాడుకుంటూ కొత్తగా క్యాష్ పొందాలి. అలాగే 'మేక్‌మై ట్రిప్' సంస్థ విజయవంతమైన రిఫరల్‌కు రూ.600, బుకింగ్‌కు రూ.800 ఇస్తోంది. ఇక.. మీరు సిటీ బ్యాంకు క్రెడిట్‌కార్డు వాడుతుంటే ఇప్పటికే తెలిసుండొచ్చు. ఆ కార్డును మీరు మరో ఐదుగురికి రిఫర్ చేసి రూ.10 వేల దాకా పొందే అవకాశం ఉంది.

**రెగ్యులర్ కస్టమర్లకు..**

కూరగాయల మార్కెట్లోనో.. పూల మార్కెట్లోనో మీరు ఎప్పుడూ ఒకే వ్యక్తి దగ్గర కొంటే.. వారు మిమ్మల్ని బాగా గుర్తుపెట్టుకుంటారు. మిగతావారికిచ్చే ధరకన్నా ఒక రూపాయి తక్కువకే ఇస్తారు కదా! ఇప్పుడు చాలా హోటళ్లు, రెస్టారెంట్లు, చైన్ సూపర్‌మార్కెట్‌లు, మార్ట్‌లు అదే చేస్తున్నాయి. తమ కార్డులను వినియోగదారులకు ఇచ్చి.. తమ వద్ద కొన్నప్పుడల్లా/సేవలను పొందినప్పుడల్లా కొంత మేర డిస్కౌంట్ ఇస్తున్నాయి. మొత్తమ్మీద ఒక్కమాటలో చెప్పాలంటే.. నోరుమంచిదైతే ఊరుమంచిదవుతుందన్న సామెత చందంగా.. మన మాటసాయం మనకే మేలు చేస్తుందన్న మాట!!



**నియామకాల్లోనూ....**

మీరు ఏ టాటా కన్సల్టెన్సీ సర్వీసెస్‌లోనో పనిచేస్తున్నారు అనుకోండి. కంపెనీలో ఏవైనా ఖాళీలు పడినప్పుడు... సమర్థుడైన అభ్యర్థిని సిఫార్సు చేస్తే కనుక, ఆ వ్యక్తి ఉద్యోగంలో చేరితే కనుక, ఎంతో కొంత మొత్తాన్ని ప్రోత్సాహకంగా అందిస్తారు. టీసీఎస్ అనే ఏముంది.... చాలా చాలా కార్పొరేట్ కంపెనీలు 'రిఫరల్ ఇన్సెటివ్స్' ఇస్తున్నాయి. కార్పొరేట్ హోమియో వైద్యశాల బాత్రాస్ కూడా... కొత్త రోగుల్ని పరిచయం చేసిన పాత రోగులకు నజరానాలు సమర్పిస్తోంది. వాణిజ్య ప్రకటనల కోసం కోట్లకు కోట్లు వెచ్చించినా... నోటి మాటకున్న విలువ నోటి మాటదే. ఇక్కడ విశ్వసనీయత ఉంటుంది, ఫలితం కళ్లముందే కనిపిస్తూ ఉంటుంది. కాబట్టే, వ్యాపార సంస్థలు ఈ తరహా ప్రచారానికి చాలా ప్రాధాన్యం ఇస్తున్నాయి. అప్పుడపుడూ హ్యాత్‌వే సంస్థ కూడా మాటసాయాలకు మంచి మంచి బహుమతులు ప్రకటిస్తుంది. ఈమధ్య 'ఓ కస్టమర్ పేరు సూచించండి... రెండు సినిమా టికెట్లు గెలుచుకోండి' అంటూ బంపరాఫర్ ఇచ్చింది.






# నయా ట్రెండ్స్!

యూత్ అంటేనే ఫ్యాషన్... ఫ్యాషన్ అంటేనే యూత్. అసలు ఫ్యాషన్ పుట్టిందే యూత్ కోసం... ఈ స్టేట్‌మెంట్‌ను కాదనే ధైర్యం ఎవరికుంది? హెయిర్ పిన్నుల దగ్గర నుంచి చెప్పుల వరకు ప్రతి ఏడాదీ ఎన్నో కొత్త ట్రెండ్‌లు మార్కెట్లోకి వస్తుంటాయ్... ఎన్ని వచ్చినా, యువత కొత్తదనానికి స్వాగతం పలుకుతూనే ఉంటుంది...



## లూజు... మోజు!

స్కిన్నీ జీన్స్ ప్యాంటు వేసుకుని తిరిగిన యువత... ఇప్పుడు వదులు మీద మనసు పడింది. ఒంటికి పట్టేసే బిగుతు ప్యాంట్లతో విసుగెత్తిందో ఏమో, అబ్బాయిలు కూడా లూజ్ ప్యాంట్ల మీద మోజుపడుతున్నారు. షర్టు, కుర్తా, కోటు పైన ఏది వేసినా కూడా.. దానికి నప్పేలా వదులు ప్యాంట్లను ఎంపిక చేసుకుంటున్నారు. తాతయ్యల తరంలోని ఈ వదులు ప్యాంట్లు మనవళ్లకి కొత్త హుందాతనాన్ని తెచ్చిపెడుతున్నాయి. ఆఫీసులకు, వేడుకలకు, విహారయాత్రలకు తగ్గట్టే వదులు ప్యాంట్లు వివిధ మోడళ్లలో దొరుకుతున్నాయి.



## మెడకి ఓ అందాల ముడి

మెడకు అతికించినట్టు ఉండే లేస్ చోకర్లు ఇప్పటి ట్రెండ్. లాంగ్ ఫ్రాక్, స్కర్టు, లాంగ్ మిడీలకు జతగా లేస్ చోకర్ చక్కగా అమరుతుంది. ఇప్పుడు లేస్ చోకర్‌ని మించిన లేటెస్ట్ ట్రెండ్ వచ్చి పడింది. అదే రిబ్బన్ చోకర్. సన్నని శాటిన్ రిబ్బన్‌ని మెడ చుట్టూ రెండు సార్లు తిప్పి ముందు వైపున ఓ ముడి వేస్తే సరి... రిబ్బన్ చోకర్ రెడీ. ఈ చోకర్ చివరి వైపున రెండు మువ్వలు ముడేస్తే మరింత ట్రెండీగా ఉంటుంది. కావాలనుకుంటే రిబ్బన్‌లోకి చిన్న లాకెట్ గుచ్చి కూడా మెడకు కట్టుకోవచ్చు. ఈ రిబ్బన్ చోకర్ జీన్స్, టాప్స్, స్కర్టు, మ్యాక్సీ... ఇలా ఏ డ్రెస్ మీదకైనా అందంగా నప్పేస్తుంది.

## రారా... ఘరారా!

అమ్మమ్మల కాలం నాటి దుస్తులకు కొత్తగా మార్పులు చేసి ఆ'పాత' మధురాలను అందంగా గుర్తుకు తెస్తున్నారు ఈ కాలం అమ్మాయిలు. పొడవు చేతుల జాకెట్లు, లెహెంగాలు ఇదిగో ఇప్పుడు ఘరారాలు. ఏంటీ ఘరారా? పూర్వం నవాబుల ఇంటి రారాణులు వేసుకునే ఖరీదైన దుస్తులు ఇవి. నడుము వరకు ఉండే టాప్, అతి వదులుగా ఉండే ప్యాంటు... వీటికి తోడు వెరీ రిచ్ లుక్. ఘరారాల ప్రత్యేకతేంటంటే... టాప్‌తో సమానంగా ప్యాంటుకు కూడా హెవీ వర్క్ ఉంటుంది. అసలు ఆకర్షణ అంతా ఆ ప్యాంటులోనే ఉంటుంది. పైన కాస్త బిగుతుగా ఉండి, మోకాలి నుంచి మాత్రం చాలా వదులుగా ఉంటుంది. కాలేజీ ఫంక్షన్లకు సరిగ్గా సూటయ్యే ట్రెండీ డ్రెస్ ఇది.





## జుట్టే... రంగుల హరివిల్లు!

హెయిర్ స్టైల్.... సాధారణ అమ్మాయిల్ని నిమిషాలలో ఆధునికంగా మార్చేయగలదు. ముడి వేసిన జడ ఓ లుక్‌ని ఇస్తే... వదిలేసిన కురులు మరో అందాన్ని అందిస్తాయి. ఇక కురుల వంకీలు, వాటికి రంగులు... అబ్బో వాటి గురించి చెప్పక్కర్లేదు. రకారకాల షేడ్స్‌తో బ్రౌన్, ఎరుపు, బూడిదరంగు ఇలా అనేక కురుల రంగులు ఫ్యాషన్ ప్రపంచంలో సందడి చేస్తున్నాయి. ఇప్పుడు మీ జుట్టునే రంగుల హరివిల్లుగా మార్చే కొత్త ట్రెండ్ వచ్చేసింది... అదే ఫైన్ లైన్ ట్రెండ్. వదిలేసిన కురులపై లేజర్ ఎఫెక్టుతో రంగులు మిరుమిట్లు గొలుపుతాయి. ఇంద్రధనుసు మీ కురులపై వాలినట్టే ఉంటుంది. హెయిర్ స్టైలిస్టులకు కాసులు కురిపిస్తోందీ న్యూ ట్రెండ్. ఫైన్ లైన్ ట్రెండ్ ఫోటోలు ఇన్‌స్టాగ్రామ్‌లో వైరల్ అవుతున్నాయి.

## గుబాళించే టాటూలు

మెడపైన, చేతిపైన, ఛాతీ పైనా.... ఇక్కడా అక్కడా అనే తేడా లేదు, టాటూకి శరీరమంతా కాన్వాసే ఇప్పుడు. యువతలో ఆ మోజు అంతా ఇంతా కాదు... ఆ క్రేజ్‌ని మరింత పెంచేందుకు గుప్పున గుబాళించే టాటూలూ వచ్చేశాయ్. వీటిని వేసుకుంటే పూల పరిమళం ముక్కును తాకుతుంది. ఇక అత్తరు పూయాల్సిన అవసరమే లేదు. ఫ్రాన్స్‌కు చెందిన విన్సెంట్ జెనోరెట్ అనే ఆర్టిస్టు నిజమైన పూలతో ఈ టాటూలను తయారుచేశారు. మూడు రకాల పుష్పాలతో వాటిని రూపొందించారు. నీలంగా ఉండే హైడ్రాంగియా... గులాబీ ఊదా రంగుల్లో పూచే పియోనీస్, గులాబీలతో వీటిని తయారు చేశారు. ఈ టాటూలను స్టిక్కర్ల రూపంలో ఆన్‌లైన్లో అమ్మకానికి పెట్టారు. వెనుక ఉన్న పలుచని కవర్‌ని తొలగించి, స్టిక్కర్ టాటూని శరీరంపై పెట్టి కాస్త నీళ్ల తడి చేసి రుద్దితే చాలు. టాటూ శరీరానికి అతుక్కుపోతుంది. ఇది తాత్కాలికమైంది. రెండు మూడు రోజుల్లో పోతుంది.



## చేపముళ్ల గౌను

అమ్మాయిలకి ఫ్యాషన్ డ్రెస్‌లంటే క్రేజ్ ఉండడం సహజం. కానీ ఈ అమ్మాయి కాస్త వెరైటీ. పొడవు గౌనులో అందంగానే కాదు, చాలా ప్రత్యేకంగా కనిపించాలన్న కోరిక ఎక్కువ. అందుకే నాలుగేళ్లు కష్టపడి చేపగౌనును డిజైన్ చేసింది. ఆ గౌను కోసం వేల సాల్మన్ చేపలను వలేసి పట్టుకుంది. చేప మధ్యలో ఉండే వెన్నుపూసలను ఇరవై వేల వరకూ సేకరించింది. దారంలో వాటిని గుదిగుచ్చి నల్లటి గౌనుపై అందంగా అమర్చింది. తన పేరు చెప్పలేదు కదూ... సింథియా గిబ్సన్, ఉండేది అలస్కాలో. ఈ డ్రెస్ వేసుకుని ర్యాంప్ వాక్ కూడా చేసింది సింథియా. ఒకరో ఇద్దరో అయితే ఫర్వాలేదు. ఫ్యాషన్ ప్రపంచమంతా చేపముళ్ల గౌన్ల మీద మనసు పడితే ... మత్స్యజాతి అంతరించి పోయే ప్రమాదం ఉంది.



# ‘బాహుబలి’ ఎద్దులు

**ఆ వృషభాలు వడివడిగా నడుస్తుంటే, ఏ కుంతల రాజ్యాన్నో కాపాడటానికి వెళ్తున్నట్టు అనిపిస్తుంది. పొరపాటున పులో సింహమో ఎదురొచ్చినా - ఆ పశువుల గాంభీర్యానికి జడుసుకుని తోక ముడిచే స్తాయి. అవి, ‘బాహుబలి’ ఎద్దులు మరి!**



**బా**హుబలి... భారతీయ చలనచిత్ర పరిశ్రమ బాహుబలాన్ని చాటిన చిత్రం. తెలుగు వాడి సృజననూ, నైపుణ్యాన్నీ విశ్వవ్యాప్తం చేసిన సినిమా. ఆ చిత్రంలో ఒక్క ఫ్రేమ్‌లో కనిపించినా జన్మధన్యమైపోయినట్టే అని భావించిన నటీనటులు ఎంతోమంది. రెప్పపాటు సమయమైనా... జీవితకాల ఖ్యాతి! ఆ చిత్రానికి పనిచేసిన ఆర్టిస్టులకే కాదు, పశువులకు కూడా బోలెడంత ‘స్టార్‌డమ్’. బాహుబలిలో ఓ కీలక ఘట్టంలో కనిపించిన మూడు జతల ఎడ్లు ప్రస్తుతం విజయవాడ పరిసరాల్లో ఆ సెలబ్రిటీ హోదాను ఎంజాయ్ చేస్తున్నాయి. చిత్రంలో హీరో ప్రభాస్, కట్టప్పతో కలసి కుంతల దేశాన్ని కాపాడటానికి బలిష్టమైన ఎడ్లను ఉపయోగిస్తాడు. వృషభాల కొమ్ములకు కాగడాలు కట్టి... నీటి ఆనకట్టను కూల్చేస్తాడు. ఆ దృశ్యంలో వందలాది ఎద్దులు పరిగెత్తినట్టు గ్రాఫిక్ మాయాజాలం చేశారు కానీ.... ఉన్నది మూడు జతలే. ఆ మేలుజాతి ఎద్దులను ఎవరికో అమ్మడం ఇష్టంలేక చిత్ర నిర్మాతలు శోభు యార్లగడ్డ, దేవినేని ప్రసాద్‌లు వాటిని... సమర్థులకు అప్పగించాలని భావించారు. తమ మిత్రుడు, విజయవాడ చైతన్య విద్యాసంస్థల డైరెక్టర్ శ్రీధర్ సలహాతో పెనమలూరు మండలంలోని పెదపులిపాకకు చెందిన దాసరి హర్నీడు, ధనేకుల సూర్యనారాయణ, కంకిపాడు మండలంలోని ఈడుపుగల్లుకు చెందిన వీరమాచనేని శ్రీనివాసరావుల చేతిలో పెట్టారు. ‘ఇక నుంచీ మీదే బాధ్యత...’ అంటున్నప్పుడు, కూతుళ్లను అప్పగిస్తున్నంత ప్రేమ. రామోజీ ఫిలింసిటీ నుంచి నేరుగా ఈ రైతుల వద్దకు చేరిన మూడు జతల ఎడ్లూ ఏరువాక ప్రారంభం కావడంతో.... దమ్ము, దుక్కి, పైపాటు తదితర పనుల్లో పాల్గొంటున్నాయి.

**కాంగ్రేజ్ జాతి...**

ఇవి గుజరాత్‌లోని కాంగ్రేజ్ రకం జాతి ఎడ్లు. ఒంగోలు పశువుల్లానే బలంగా ఉంటాయి. కొమ్ములు భారీగా, వాడిగా, మెలికలు తిరిగి భీకరంగా కనిపిస్తాయి. ‘బాహుబలి’లో కనిపించిన వృషభరాజాలతో ఏరువాకను మొదలుపెడితే తమకూ కలిసి వస్తుందని పెనమలూరు, కంకిపాడు మండలాల ప్రజలు భావిస్తున్నారు. ఆ సెంటిమెంట్‌తోనే కంకిపాడు ఎంపీపీ దేవినేని రాజా సమక్షంలో పనులు ప్రారంభించారు.

నాగలి కడితే చాలు... ఆ బాహుబలి ఎద్దులు పొలంలో పరుగులు తీస్తున్నాయి. వాటి వేగాన్ని అందుకోడానికి నానా తంటాలూ పడాల్సి వస్తోంది. రోజుకు ఆరు గంటలైనా అలుపూ సొలుపూ ఉండదు. ఉదయం, సాయంత్రం ఒక్కో ఎద్దుకు రూ. 300 విలువ చేసే దాణా, మేత పెడతామని చెబుతున్నారు రైతులు. ఉలవలు, జొన్నలు, పచ్చగడ్డి, జనపకట్ట నిత్యాహారం. ఒక్కో ఎద్దుకు నెలకు... పదిహేనువేల దాకా ఖర్చవుతోంది. బహిరంగ మార్కెట్‌లో ఈ జాతి ఎద్దులు.... ఒక్కో జతా రూ. 4 లక్షల వరకూ పలుకుతాయి.

**చూపులకే భీకరం...**

యమకింకరుల్లా పదునైన కొమ్ములతో... భీకరంగా కనిపించే బాహుబలి ఎడ్లు మహా సాధుజీవులు. కొత్త వారితోనూ కలసిపోతాయి. కొమ్ములు విసరడం, కాళ్లలో తన్నడం వంటివి చేయవు. ఎంతటి బరువైనా మోస్తాయి, అవలీలగా చేరవేస్తాయి. దుక్కి, దమ్ముల్లో ఒంగోలు జాతి ఎద్దులే వీటికి సరిసాటి. ఎంత ఎండలో పనిచేసినా వీసమెత్తు అలసటకూ లోనుకావు. పోషణకు ప్రత్యేకమైన జాగ్రత్తలు తీసుకోవాల్సిన అవసరం ఉండదు. మిగతా పశువుల మాదిరే దాణా పెడితే చాలు. ‘నిర్మాత యార్లగడ్డ శోభుకు వాట్సాప్ ద్వారా నెలకోసారి అయినా వీటి ఫొటోలు పంపిస్తుంటాం. నందమూరి హరికృష్ణ ఎద్దుల్ని చూడటానికే ప్రత్యేకంగా ఓసారి మా డెయిరీకి వచ్చారు’ అంటారు వీరమాచనేని శ్రీనివాసరావు. ‘వీటిని మాలిమి చేసుకోవడం తేలిక. వ్యవసాయంలో రైతుకు వెన్నెముకగా నిలుస్తాయి’ అని చెబుతారు దాసరి హర్నీడు ‘చెరకు, పత్తి, పసుపు, వరి... ఇలా మెట్ట, మాగాణి ఏ భూముల్లోనైనా పనిచేయగలగడం వీటి ప్రత్యేకత’ అని మెచ్చుకుంటారు మరో రైతు ధనేకుల సూర్యనారాయణ. ఎద్దులు కాబట్టి, ‘ఆటోగ్రాఫ్ ప్లీజ్’ అని అడగలేరు. కానీ, ఫొటోగ్రాఫ్ కోసం... అందులోనూ సెల్ఫీల కోసం యువత ఎగబడుతోంది. బోలెడన్ని షేర్లూ లైకులూ వస్తాయి మరి. ‘మీరు తోడుగా ఉన్నంత వరకూ దిగుబడిలో మనకు సాటి వచ్చే వారేలేరు...’ అంటూ ఆ మూగజీవాల భుజం తడుతున్నారు బాహుబలి రైతులు.

– **పి.ఫణి,** ఆంధ్రజ్యోతి, విజయవాడ ఫీచర్స్

ఫొటోలు: **ఆనంద్**





# హోమియో వైద్యానికి
# ఇప్పుడు స్టార్ స్టేటస్ వచ్చింది


**డా. మధు వారణాశి, ఎం.డి**
**ప్రముఖ హోమియో వైద్యులు**
**ప్లాట్‌నెం 188,**
**వివేకానందనగర్ కాలనీ,**
**కూకట్‌పల్లి, హైదరాబాద్**
**ఫోన్ : 8897331110**
**8886 509 509**




***సక్సెస్‌ఫుల్ కెరీర్‌ని ఎంజాయ్ చేస్తున్నారు కదా! ఫ్యూచర్ ప్లానింగ్స్ ఏంటి?***

ఇకపై ***ఆర్థికంగా వెనకబడిన వారికి హెపటైటిస్-బి, హెర్పిస్, హెచ్ఐవి వ్యాధిగ్రస్తులకు 50శాతం డిస్కౌంటుతో చికిత్సను అందించాలని నిర్ణయించుకున్నాను.*** దాన్ని గత నెల నుంచే అమల్లోకి తీసుకొచ్చాను. త్వరలోనే ఇతర వ్యాధులకు చికిత్స తీసుకునే వారిలో పేదలకు 50శాతం తగ్గిస్తాను. ఈ ఏడాది ఏప్రిల్ 10న హోమియో వైద్యపితామహుడు డా.హానిమన్ బర్త్‌డే సందర్భంగా దాదాపు 100 మందికి ఉచితంగా ట్రీట్‌మెంట్, మందులు ఇచ్చాము. ఇకపై ప్రతిఏటా హానిమన్ బర్త్‌డే రోజున ఈ ఫ్రీ ట్రీట్‌మెంట్ కొనసాగుతుంది.

**హోమియో వైద్యరంగంలో డా.మధువారణాశి పేరు తెలియని వారు లేరు. రెండున్నర దశాబ్దాలు పైబడిన ప్రాక్టీస్‌లో ఆయన సాధించిన విజయాలు ఎన్నో...ఎన్నెన్నో. ఎన్ని విజయాలు సాధించినా సామాన్య రోగులకు అందుబాటులో ఉండటం ఆయన ప్రత్యేకత. పేషెంట్ ఆర్థిక స్థితిగతులను కూడా ఆలోచిస్తాడు కాబట్టే అందరూ ఆయన్ను "మా డాక్టర్ గారు దేవుడు" అంటారు. ఆయనతో ఇంటర్వ్యూ...**

***మీరు ప్రజాసేవలోకి రాబోతున్నట్టుగా వార్తలు వినిపిస్తున్నాయి. రాబోయే ఎన్నికల్లో పోటీ చేసే అవకాశం ఉందా?***

కొందరు హితులు, సన్నిహితులు రాజకీయాల్లోకి రమ్మని ఆహ్వానిస్తున్నారు. ప్రోత్సహిస్తున్నారు. నాకూ ఆసక్తి ఉంది. అయితే ఇప్పుడే ఏమీ చెప్పలేను. ఆ సమయంలో పరిస్థితులను బట్టి నిర్ణయం తీసుకుంటాను.

***కెరీర్ పరంగా సంతృప్తి కలిగించిన సందర్భాలు...?***

ఇప్పటికి ఎన్నో వేల మందికి ట్రీట్‌మెంట్ ఇచ్చాను. రెండు, మూడు నెలలకు మించి బతకరు అని బయటి ఆసుపత్రులలో డిక్లేర్ చేసిన కేసులలో పేషెంట్ లైఫ్‌ని 4-5 ఏళ్లు పెంచినపుడు వారి కళ్లలో కనిపించిన కృతజ్ఞత ఎంతో సంతృప్తినిచ్చింది. నా కెరీర్‌లో అలాంటి కేసులెన్నో ఉన్నాయి.

***మీ ప్రాక్టీస్ స్ఫూర్తితో కొందరు హోమియో వైద్యం చదివారని విన్నాం?***

నన్ను చూసి ఇన్‌స్పైర్ అయి వారి పిల్లలను బి.హెచ్.ఎం.ఎస్ చదివించారు. వారు కోర్సులు కూడా పూర్తి చేసి ఇప్పుడు ప్రాక్టీస్ చేస్తున్నారు. ఇంకొంత మంది చదువుతున్నారు. దీన్నిబట్టి హోమియో వైద్యానికి ఎంత ఆదరణ లభించిందో, ఎంతటి స్టార్ స్టేటస్ వచ్చిందో అర్థం చేసుకోవచ్చు.

***మానసిక వికలాంగులకు, అనాథ పిల్లలకు గత 10 ఏళ్లుగా సేవలు అందిస్తున్నారు కదా. ఇప్పుడు కొత్తగా ఏవైనా సేవాకార్యక్రమాలు ప్లాన్ చేస్తున్నారా?***

చదువులో మంచి మార్కులు వచ్చినా పేదరికం కారణంగా చదవలేని పది, ఇంటర్ విద్యార్థులను కొందరిని ఎడాప్ట్ చేసుకుని వారికి కావలసిన పుస్తకాలు, ఫీజులు, ఇతర వసతులు కల్పించి చదివించాలని నిర్ణయం తీసుకున్నాను. ఆ ప్రణాళిక కూడా తుదిదశకు చేరుకుంది. ఇటీవలే గాజుల రామారం వద్ద అనాధ పిల్లల వసతి గృహ నిర్మాణానికి ధనసహాయం అందించాను. తిరుపతికి సమీపంలోని నెరబైలు వద్ద రామాలయం జీర్ణోద్ధరణకు కొంత ఆర్థిక సహాయం అందించాను. ఇకపై వారణాశి ఛారిటబుల్ ట్రస్ట్ ద్వారా సేవా కార్యక్రమాలు విస్తృతం చేయబోతున్నాను.

# హోమియోతో
# అంగస్తంభన సమస్య దూరం

శ్రీనివాస్‌కి 28 సంవత్సరాలు. ఆరునెలల క్రితం అందమైన అమ్మాయితో పెళ్ళయింది. తను ఊహించుకున్న దానికన్నా అందగత్తె భార్యగా రావడంతో ఆనందానికి అవధులు లేదు. ఇతరత్రా ఆర్థిక ఇబ్బందులు కూడా లేకపోవడంతో శృంగార జీవితాన్ని బాగా ఎంజాయ్ చేశాడు. ఆరు నెలలు ఆరు రోజుల్లా గడిచిపోయాయి. కానీ ఒకరోజు పడకగదిలో వైఫల్యం. ఎంత ప్రయత్నించినా అంగస్తంభన కాలేదు. అనుకోకుండా వచ్చిన మార్పు ఎందుకో అర్థం కాలేదు. రోజూ రెండు మూడు సార్లు శృంగారంలో పాల్గొనే తను ఇప్పుడు రెండు, మూడు రోజులకు ఒకసారి కూడా భార్యతో గడపడంలేదు. భార్య నోరు తెరిచి ఏమీ అడగకపోయినా సుఖాన్ని అందించకలేకపోతున్నాననే బాధ రోజురోజుకి పెరగసాగింది. భార్యప్రేరేపించినా మధ్యలోనే అంగం మెత్తబడిపోతోంది. శృంగారంలో పాల్గొనాలనే కోరిక ఉన్నా సాధ్యం కావడం లేదు. దాంపత్య జీవితానికి ఇక పనికిరానేమో అని భావించి ఒకసారి డాక్టర్‌ని కలిసి పరిస్థితిని వివరిద్దామని నిర్ణయించుకుని నా దగ్గరకు వచ్చారు. ఎంతో ఆవేదనతో తన బాధనంత చెప్పుకోచ్చారు.

**కారణాలు అనేకం :** మానసిక ఒత్తిడి, అధిక శారీరక శ్రమ, మానసిక ఆందోళన వంటివి ఈ సమస్యకు ముఖ్యకారణాలుగా చెప్పుకోవచ్చు. మానసిక ఆందోళనతో లేదా శారీరక ఒత్తిడితో వచ్చే సమస్యలను చాలా వరకు మంచి వైద్యునితో కౌన్సెలింగ్ చేయించుకోవడం ద్వారా తగ్గించుకోవచ్చు. మంచి నిద్రతో అలసట, మానసిక ఒత్తిడి తగ్గుతుంది. దీనివల్ల శరీరంలో లైంగికపరమైన కోరికలు పెరుగుతాయి. శృంగార జీవితానికి మంచి మనసు, మంచి ఆహారం దోహదపడతాయి. దంపతులు మూడ్‌ను పెంచే విషయాలను పరస్పరం చర్చించుకోవాలి. చిన్న చిన్న పనులతో మొదలుపెట్టాలి. దీంతో ఇద్దరికీ తెలియని ఉద్రేకం మొదలవుతుంది. శృంగారం విషయంలో స్త్రీపురుషుల మధ్య సరియైన ఆకర్షణ లేకపోతే లైంగిక సమస్యలు తలెత్తుతాయి. అలాకాకుండా తన భాగస్వామిలో ఒకరకమైన ఆసక్తి లేకపోయినా శృంగార జీవితంలో సమస్యలు ఎదురవుతాయి. ఒకవేళ స్త్రీనుంచి సరియైనప్రేరణ, కోరిక లేకపోయినా తన నిర్లిప్తత వల్ల ఒక రకమైన నిరాశావాదం ఎర్పడి అంగస్తంభనవైఫల్యం జరుగుతుంది.

**చికిత్స :** లైంగిక సమస్యలను దూరం చేసే ఔషధాలు హోమియోలో చాలా ఉన్నాయి. అంగస్తంభన వైఫల్యం, శీఘ్రస్ఖలనం వంటి సమస్యలకు హోమియో మందులు వరప్రసాదంగా పనిచేస్తాయనండంలో అతిశయోక్తి లేదు. ఇది చాలా సున్నితమైన అంశం. రోగి బలహీనతలపైన ఆధారపడి ఉంది. సరియైన వైద్యుని పర్యవేక్షణలో మందులు వాడితే లైంగిక జీవితం ఎంతో హాయిగా ఉంటుంది. శారీరక, మానసిక లక్షణాలపై ఆధారపడి చికిత్స చేస్తే ఎలాంటి సమస్య అయినా దూరమవుతుంది. చికిత్సతో పాటు సరియైన ఆహారం తీసుకుంటే అంగ స్తంభన సమస్య నుంచి సులువుగా బయటపడవచ్చని వివరించడంతో శ్రీనివాస్‌లో ఎంతో ధైర్యం వచ్చింది. కొన్ని నెలలు చికిత్స తరువాత అతని శృంగార జీవితం హాయిగా సాగిపోతోంది.

# సముద్రం నిద్రపోదు..!

కిరణ్ చర్ల

ఈ వారం కథ

**"దగ్గరకురా ... ఏంటి వేషాలేస్తున్నావ్?"**

**" .... .... .... "**

**"అదే వస్తుందిలే అని తమాషా చూస్తున్నావా?"**

**కళ్లలో కొంటెతనం ... కొంచెం నవ్వు.**

**అలలు అలలుగా మోహం పొంగుతోంది.**

**ఆశ్చర్యంగా చూస్తున్నా ...**

**తానే దగ్గరికొచ్చింది. మనోరంజని పరిమళం ...**

**చేతిలో చేయి వేసి కొంచెం కొంచెంగా లోపలికి నడుస్తోంది.**

**నిజానికి తనకు నీళ్లన్నా అలలన్నా భయమే.**

**అది తెలుస్తూనే ఉంది.**

**కానీ, పక్కన మనిషుంటే ధైర్యం చేయగలదనుకుంటా! అడుగులో అడుగు వేస్తూ, కెరటాలను చీల్చుకుంటూ మెల్లగా నడుస్తున్నాం. అదాటున వచ్చి కావలించుకునే పసిపాపలా, స్వచ్ఛమైన కోరికలా, నిగ్రహంలేని కాంక్షలా .. కడలి నిలువెల్లా తడిపేస్తోంది.**

**కొత్తదారుల్లో పాతమనిషితో నడక!**

చంద్రభాగ బీచ్, కోణార్క్, ఉదయం ఆరు గంటలు.

ఆకాశం నుదుటిని ముద్దాడుతున్న ఎర్రటి బింబం. నల్లటి నీళ్లపై ప్రతిఫలిస్తూ నునులేత కిరణాలు ...

ఏమాటకామాటే చెప్పుకోవాలి. సముద్రం లేని ఊరు అసలు ఊరే కాదు... ఇలా ఎన్నిసార్లనిపించిందో! సముద్రాన్ని చూడగానే ఎక్కడిదో అనాది చైతన్యం నిద్రలేస్తుంది. నేను అనే భావన దాటి, సమస్త ప్రకృతి నేనే అనే అనుభూతి మొదలవుతుంది. ఎప్పుడో ఓ పదిహేనేళ్ల క్రితం సూర్యలంక బీచ్‌లో ఆడుకున్ననాటి నుంచి ప్రతిసారీ అదే అనుభవం..

"మేడమ్ అపణా ఫోటో ఉఠెయ్ బేకి....?" ఓ ఫోటోగ్రాఫర్ మెడలో కెమేరాతో వచ్చాడు.

"పంచా మినిట్ బితరే దై దెబి.."

అయిదు నిమిషాల్లో తెస్తా అంటున్నాడు.

కెమేరా రెడీ చేశాడో లేదో .. ఫోజులివ్వటం మొదలు పెట్టింది.

కళ్లముందు కోణార్క్ శిల్పం .. ఫేడెడ్ డెనిమ్ షార్ట్, బ్లూ టాప్.. జుట్టు బిగించి క్లిప్ పెట్టింది. ముప్ఫైఏళ్లుంటాయంటే నమ్మటం చాలా కష్టం. ఐదున్నర అడుగుల నిలువెత్తు అందం.. ఏ ఫోటోలు బంధించగలవు?

ఒకటి రెండనుకున్నవి, పది, పదిహేను ఫోటోలు దాటాయి. ఎంత కాస్ట్లీ మొబైల్ చేతిలో ఉన్నా.. సెకనుకో సెల్ఫీ దిగుతున్నా.. ఇంకా ఫోటోలంటే తగని పిచ్చి.

ప్రశ్నలు, సమాధానాలు, అభ్యంతరాలు, సంజాయిషీలు .. అన్నీ మాయమైన సాగర తీరంలో ఆమెతో నేను .. ఆ ఉదయంలో..

అలలు కలలు ఎగసి ఎగసి అలసి సొలసి ...

సముద్రం ఎదురుగా తడి ఇసుకలో చుబుకం కింద చేయి ఆన్చి కూర్చుని శూన్యంలోకి, సముద్రం లోలోతుల్లోకి, సుదూర అస్పష్ట కడలి గర్భంలోకి, తదేకంగా చూస్తూ అలలను అయస్కాంతంలా తన కళ్లతో లాగుతోంది. కెరటాలు ఆమెను మృదువుగా తడిమి వెనుదిరుగుతున్నాయి. మధ్య మధ్యలో నా వైపు వింతగా చూస్తోంది.

ఒళ్లు విరుచుకున్న తొలిపొద్దు నులివెచ్చని కోరిక. తొలి కిరణాలను ఆత్రంగా కావలించుకున్న సంద్రం ఆరాటం. ఎగసిన కెరటంలోని కాంక్ష.. తడి ఇసుకలోని నిర్మలత్వం.. కరుగుతున్న మంచు తెరని వదల్లేక మీదికి లాక్కున్న సుదూర పర్వత దాహం, ఒళ్లంతా తడిమేస్తున్న చల్లగాలి ప్రేమ..

ఆమె .. నేను .. సముద్రం .. కాలం ఆగింది.

"ఏంటోయ్ కొత్తగా కనపడుతున్నావ్?" అడిగిందామె.

నిజమే...! ఈ పజిల్ ఎప్పటికి వీడుతుంది? ఈ ప్రశ్నలకు సమాధానం ఎప్పుడు దొరుకుతుంది? ఈ పరిచయం ఏ మలుపు తిరుగుతుంది? సముద్రం ఎప్పుడూ కొత్తగానే ఉంటుంది. లాగేసుకోవాలనే చూస్తుంది. సముద్రాన్ని కావలించుకునే విఫలయత్నం నాలో ...

• • •

డాన్స్ ఫెస్టివల్లో నాలుగోరోజు..

ఓపెన్ ఎయిర్ ఆడిటోరియమ్ మిరుమిట్లు గొలిపే లైట్ల మధ్య వెలిగిపోతోంది. సంగీతకళ గాత్రం, రాజేశ్వరీ సాయినాథ్ నాట్యం. బాసురి, వయోలిన్, సితార్ ... మంత్రిస్తున్న హంసధ్వని. బ్యాక్ డ్రాప్‌లో సూర్యదేవాలయం. చుట్టూ ప్రేక్షకుల కోలాహలం. సరిగ్గా అప్పుడే ...

నా కళ్లను నేనే నమ్మలేకపోయాను. నాకు మూడు వరుసల ముందు కూర్చుని ఉంది. పక్కనున్నవాళ్లతో ఏదో నవ్వుతూ చెప్తోంది. అవును ... తనే!

ఆ రోజు ప్రదర్శన అయిన తర్వాత? తను వెళ్తున్నవైపే నడుస్తూ పిలిచాను. అనుమానంగా వెనక్కు తిరిగింది. ఆశ్చర్యం తనలో ... నవ్వుతూ వస్తోంది దగ్గరకు ... రోజూ కలిసే వ్యక్తిని చూసినట్టే! లైట్ బ్లూ టోర్న్ జీన్స్, మెరూన్ కలర్ టాప్, గాలికి అలల్లా ఎగురుతున్న జుట్టు... అప్పటి కంటే ఇప్పుడు మరింత గ్రేస్ ఫుల్‌గా మారిందనే చెప్పాలి. ఇప్పుడు మీరు అనాలా?

"మేడమ్.. మిమ్మల్ని.."

"పోరారేయ్..." పకపక నవ్వింది. అదే నవ్వు. అదే పిలుపు. అదే మెరుపు.

ఇన్ని సంవత్సరాల దూరం ఆ ఒక్క మాటతో మాయమయింది.

• • •

రాతి శిల్పాలలో దాగిన లాలిత్యం .. స్పర్శకందని మెత్తదనం .. నృత్యభంగిమల్లో దాగిన మర్మం.. కోణార్క్ శిల్పాలను చూసి ముసి ముసిగా నవ్వుతోంది.



ఈ మధ్యే ఓ ట్రావెల్ అండ్ టూరిజమ్ మ్యాగజైన్‌లో జాయిన్ అయిందట. ఎసైన్‌మెంట్‌లో భాగంగా కోణార్క్ వచ్చింది. పనిలో పనిగా డాన్స్ ఫెస్టివల్ కూడా కవర్ చేస్తోంది.

పాత మనిషితో కొత్త అడుగులు?

"ఈ శిల్పాలేం చెప్తున్నాయో వినిపిస్తోందా నీకు? అంత సులభంగా అందని ఆలాపన... జీవితానికి ఏది ముఖ్యమో తెలిసిన వారికి మాత్రమే వినిపిస్తుంది.." నాకు చెప్తోందా.. తనలో తానే అనుకుంటోందా? అర్థం కాలేదు.

డాన్స్ ఫెస్టివల్ చివరి రోజు ... ప్రదర్శనకు చాలా టైమ్ ఉంది.

సూర్యదేవాలయం అణువణువూ పరిశీలిస్తోంది. నోట్స్ రాసుకుంటోంది. ఇప్పుడు కాస్త గంభీరంగా కనిపిస్తోంది కానీ, నిజానికి ఆమె చాలా చిత్రమైన వ్యక్తి. అల్లరిగా, చిన్న పిల్లలా ప్రవర్తించేది.

ఆమెతో పరిచయం ఇవాళ కొత్తగా జరిగిందేం కాదు!

నా కళ్లముందు గతం తారట్లాడుతోంది ..

"ఉండు నేను గీసిపెడతాగా.."

వర్షంతో తడిసిన ఓ సాయంత్రం కొలీగ్స్‌తో కాఫీ చప్పరిస్తూ ఉన్నా. ఆఫీస్ క్యాంటీన్‌లో వర్కర్ కూతుర్ని ఒళ్లో కూర్చోపెట్టుకుని పెన్సిల్‌తో ఏదో బొమ్మ గీసి చూపెడుతోంది.

"ఇలా కాదు. ఆ ... ఇలా .."

అదీ నేను మొదటి సారి ఆమెను చూసినప్పటి జ్ఞాపకం.

నవ్వుతూ, తుళ్లుతూ, కాగితాలతో బొమ్మలు, పడవలు, విమానాలు చేస్తూ, పూలను కావలించుకుంటూ, మేఘాలను ముద్దాడాలని ఎగురుతూ పిచ్చి ప్రయత్నాలు చేస్తూ ఉండేది.. అందరితో ఒకే జోష్. ఆడా మగా తేడా లేదు.

నేను ప్రపంచాన్ని పట్టించుకోకుండా తిరుగుతున్న రోజులవి. ఆమె, నేను ఒకే కంపెనీలో వేర్వేరు ప్రాజెక్టుల్లో పనిచేసేవాళ్లం. అప్పుడప్పుడు కనిపించే ఆమెను చూస్తే కొత్తగా, అలాంటి వ్యక్తిని అంతకుముందు చూడలేదనిపించేది. లిఫ్ట్‌లో ఎదురైనా, క్యారిడార్‌లో కనిపించినా నా వైపు తెల్లబోయి చూసి ఫక్కున నవ్వి, కళ్లెగరేసేది. అవ్యక్తంగా గడిచిన రోజులవి. ఏదో ఇష్టం ఇద్దరిమధ్యా ఉందనిపించేది. కారణం తెలీదు. కొన్ని మాటలు, కొన్ని కాఫీలు, కొన్ని కనుసైగలు, మరికొన్ని అర్థంలేని నవ్వులు ... సహజంగా కొలీగ్స్ మధ్య ఉండే కృత్రిమ మర్యాదలెక్కడో తప్పిపోయాయి. మీరు నుంచి నువ్వుగా మారటానికి పెద్దగా టైం పట్టలేదు. ఆ తర్వాత ప్రొఫెషనల్‌గా బిజీ కావటంతో కమ్యూనికేషన్ లేక రెండు మూడేళ్లయింది. ఇన్నాళ్లకు ఇలా ... కోణార్క్‌లో, చంద్రభాగ తీరంలో!

• • •

లోటస్ ఎకో రిసార్ట్, రాత్రి పదకొండు



దాటుతోంది.

డాన్స్ ఫెస్టివల్ ముగిసింది. అందరూ ఎక్కడికక్కడ సర్దుకుంటున్నారు. ఉదయాన్నే తిరుగు ప్రయాణాల కోసం హడావుడి పడుతున్నారు. ఇద్దరం కాసేపు చల్లగాలికి తిరుగుదాం అనుకున్నాం. ఫ్రెష్ అయి వస్తానంటూ తన రూమ్ లోకి వెళ్లింది. ఏదో ఆలోచిస్తూ లాన్‌లో బెంచ్‌పై కూర్చుని సిగరెట్ వెలిగించాను. డిసెంబర్ నెల. వాతావరణం చల్లగా ఉంది. ఆకాశంలో లేత మబ్బులు వేగంగా పరిగెడుతున్నాయి.

ఉన్నట్టుండి గాలిలో మనోరంజని పరిమళం.

"లే నడుద్దాం" చెయ్యిచాపింది.

అలా నడుస్తూ ఓ దగ్గర కూర్చున్నాం. లోలోపల ఏదో కొత్తగా తెలుస్తోంది. ఇప్పుడా పాతపరిచయం ఓ కొత్త మలుపు తీసుకుంటోందా? అవకాశమా? సందర్భమా? ప్రకృతి ఒడిలో సహజ స్పందనా? ప్రపంచమంతా ఒక్కసారిగా నిశ్శబ్దించినట్టనిపిస్తోంది. చేతులు వణుకుతున్నాయి. నుదుటిపై చిరుచెమట పడుతోంది. మౌనాన్ని ఛేదించటానికి కొంచెం దగ్గి ఏవో అర్థం లేని మాటలు మాట్లాడాను. నా గొంతు నాకే కొత్తగా వినిపిస్తోంది. తల తిరుగుతోంది. నా కళ్లలోకి సూటిగా చూస్తోంది. ఒక్కసారిగా తన అరచేతిని పట్టుకుని ముద్దాడాను. ఒక్క ఉదుటన లేచి తన గదిలోకి విసురుగా వెళ్లిపోయింది.

ఆకాశమంతా చిక్కటి చీకటై నా మొహాన కురిసింది. నిశ్శబ్దంలో గంటా, రెండు గంటలా తెలీదు.. కూర్చుండిపోయాను. ఏం జరుగుతుంది? ఉదయాన్నే తన ముఖం ఎలా చూడాలి? క్షణ కాలం వంద ప్రశ్నలు ముంచెత్తాయి. కాసేపటికి తెలియని ఒంటరితనం ఆవహించి, ఒక్కసారిగా దిగులు కమ్ముకొంది. కానీ, చిమ్మచీకటిలో ఒక్కసారిగా మెరుపు. ఆమె మళ్లీ బయటికొచ్చింది. నేను ఏ మాత్రం ఊహించలేదు. ఏదో అర్థం కాని నిజం బోధపడుతోంది. ఇద్దరం చెట్ల మధ్య నడుస్తున్నాం. మెల్లగా ఇద్దరి చేతివేళ్లు పెనవేసుకున్నాయి.

అక్కడక్కడా దీపకాంతులు చెట్ల నీడల్ని ముద్రిస్తున్నాయి. కాటేజ్ పక్కనే ఉన్న కొండ చీకట్లోంచి తొంగి చూస్తోంది. దూరంగా ఏదో పాట .. తలత్ స్వరం వెల్వెటీగా కంపిస్తోందా .... వినిపిస్తోందా.. లేక నేనే భ్రమపడుతున్నానా.. ఆమెనుంచి గుప్పుమంటున్న మనోరంజని పరిమళం నన్ను లాగేస్తోంది. రెట్టింపు వేగంతో కొట్టుకుంటున్న గుండెలు.... నీవెందుకున్నావిక్కడ .. నేనెందుకున్నాను ..

తడిస్పర్శ ముద్రించింది పెదాలపై కాదు? మనసుపై ...

'ఒక దీప కళిక చూశా.. నే శలభమైన చోట ..' తెరేష్ నిజమే బాస్..

• • •

సముద్రపు హోరు ఒక్కసారిగా జ్ఞాపకాల్లోంచి బీచ్‌లోకి లాక్కొచ్చింది. రాత్రి గురుతులను రహస్యంగా తెచ్చుకున్న ఉదయం అది. క్షణకాలం ఇద్దరి కళ్లూ కలుసుకున్నాయి.

సముద్రపు హోరు. చిరు చెమట తడి. చల్లటి గాలి. నన్ను నాకే కొత్తగా పరిచయం చేసిన ఒకానొక ఉదయంలో ఆమెతో నేను. ఎప్పుడెవరు జీవితాన్ని అల్లుకుపోతారో, ఏ పాదముద్రలను శాశ్వతంగా వదిలి వెళ్తారో ఎలా ఊహించగలం?

క్యాబ్‌లో రూంకి చేరాం. స్నానాలు, టిఫిన్లు, కాసేపు కబుర్లు, లంచ్ ... అన్నీ పూర్తయ్యే సరికి మధ్యాహ్నం రెండు దాటింది.

కాస్త కునుకు తీసిన సాయంత్రం రాత్రిని కావలించుకుంది.

• • •

"వన్నైట్ స్టాండ్ .. అంతకంటే బుర్రలో ఏం పెట్టుకోవద్దు. ఓకేనా..?" నా అరచేతులపై తన చూపుడువేలితో వెచ్చగా రాస్తూ మెల్లిగా అంది.

ఆమె గదిలో నేను. కొంచెం ఆనుకుని కూర్చుంది. మనోరంజని పరిమళం కమ్ముకుంటోంది. ఆమె కళ్లలో ఉదయం ఆడుకున్న సముద్రపు అలలు. గాలికి కదులుతూ చెంపలమీదుగా భుజంపైకి జారుతున్నజుట్టు.. అలలు కాళ్లను తాకుతూ .. అల్లరిగా ఇసుకను లాక్కెళ్తున్న అనుభూతి..

అనుకోకుండా ఆమె పాదాలను చేతులతో తడిమాను.

"మన మధ్య ఏం జరిగింది? ఏం జరుగుతోంది?" అడిగిందామె.

"మ్యాజిక్ ..."

"అవునా...! ఎన్నాళ్లుంటుంది మరి ఈ మ్యాజిక్ .. ?"

ఆమె మెడవంపులో తల దాచుకున్నా .. మత్తెక్కించే పరిమళం.

"రేయ్ ... అసలీ ప్రపంచంలో అందమైంది ఏంటో తెలుసా..? జనాలంతా ప్రేమ.. ప్రేమ.. అని ఓ గోల చేస్తుంటారు? ఎక్కడుందోయ్ ప్రేమ. మనం చూస్తున్న అందరిలో నిజంగా ఉందంటావా? ఓ తోడు

కావాలనుకుంటూ, గానుగెద్దు జీవితంలో దొర్లటానికి ప్రేమ, పెళ్లి అని పేర్లు పెట్టుకుంటారేమో! కానీ, ఒక్కటి మాత్రం నిజం. మోహం ఉంటుంది చూశావా.. అది నిప్పు కణికలాంటిది. అదీ అసలైన ఎలిమెంట్. ఒకరు శారీరకంగా, మానసికంగా మనకు కావాలి అని బలంగా అనిపించటం. అందులోనే బతికిన క్షణాలుంటాయి. దాన్ని అనుభవించిన వాళ్లకే తెలుస్తుంది. మిగిలిందంతా వట్టి చెత్త మాత్రమే. ఆ మోహ సంద్రంలో మునుగుతూ ఉన్నంతకాలమే నాలో జీవం.. ఆ తర్వాత మిగిలేది వొట్టి డొల్లమాత్రమే.. మన గత జీవితంలో నువ్వు నేను చెప్పుకోని ఇష్టాలు నాకు తెలుసు ... ఎలా .. అని అడక్కు.. తెలుసు అంతే! కానీ, ఇప్పుడు నువ్వు నేను .. ఈ రెండు రోజుల దగ్గరితనంలో, ఈ ప్రపంచాన్ని పక్కకు నెట్టి ఒక్కటైన.. ఈ అమూల్యమైన క్షణాలకు ఎలా విలువ కడతావు..? ఎన్ని వజ్రాలు రాశులు పోస్తే దీనికి సమానమౌతాయి..?" ఆమె ఉద్రేకం స్పష్టంగా తెలుస్తోంది.

మత్తుగా వింటున్నాను.

"ఇప్పుడు నువ్వంటే ఇష్టం .. జాలి ... నువ్వు నాకోసం పడుతున్న తపన చూస్తే, పసివాడిలా ఆత్రంగా అల్లుకున్న నిన్ను చూస్తే నా కోపాలు, సమస్యలు, దిగుళ్లు అన్నీ పక్కనపెట్టి నీ కోసం కరిగిపోవాలనిపిస్తోంది..."

కాలం మెత్తగా కరిగిపోతోంది ...

'నా కోసం నగ్నమైనప్పుడు మాత్రమే నాదానివి.. బట్టలేసుకున్నాక ప్రపంచపుదానివి.. ఎప్పుడో ఓ నాడు ఈ ప్రపంచాన్ని చించి పోగులుపెడతాను ...' ఇస్మాయిల్ సాబ్ .. నీ కవిత్వానికి సలామ్.

నడిసంద్రంలో మునుగుతున్నా .. నిలువునా ముంచి, అగాధానికి లాక్కెళ్లే నీటిలో ఊపిరాడని అనుభవం. తడి పెదవుల రుచి..

ఆమె ఎదురుగా ఉన్నానా? నిజమేనా?

అనుభూతికి కాంతి వేగం అందితే... అది అతిధ్వనిలాంటిది.. ఊహకందదు.. కాలాన్ని నిలిపేసి ఏదో మాయచేసి నా గుబురుగడ్డాన్ని గుప్పిట్లో గుంజుతూ ఉంటే... ప్రాణం ఉందో లేదో.. నాకేం తెలుసు.. నేనెవరో, అక్కడెందుకున్నానో.. నాకేం తెలుసు? తీపి వగరు కలిపి మనోరంజని పరిమళాన్ని జోడిస్తే.. భూగర్భంలో వెయ్యిమైళ్ల లోతున మట్టి వాసనకు, నడి సముద్రం గాఢ స్పర్శకు మధ్య లోయలో దూకేసిన నాకేం తెలుసు..? అగ్గిరాజుకుంది.. నిద్దురకు సెగరాజేసి, గ్రహాల మధ్య స్థిరంగా కదులుతున్న శూన్యావధిలో నన్ను నేను విసిరేసి, ప్రాణాన్ని విడిచి....కనిపించని, వినిపించని తీరంలో నన్ను నేను పోగొట్టుకుని ... ప్రాణాన్ని విడిచి! సృష్టి మొదలయింది ఇక్కడేనా..?

తుఫాను చల్లబడింది. ఇంతసేపూ నాలో తనను వంపిన పెదాలిపుడు కాఫీ కప్పుని అందుకున్నాయి.

"హలో బాస్..! కోణార్క్ కబుర్లు.. ఈ సముద్రంలోనే వదిలేయాలి" అంది సడెన్‌గా.

కొన్ని ఇష్టాలను కష్టంగానే అంగీకరించాలి.. మనసును పెకలించి బతికెయ్యాలి.



"అర్థం చేసుకుంటావ్ కదా.." జారని కన్నీటి చుక్క ఒకటి రెప్పల వెనుక....

నిజమే.. తను అలా అనటంలో పెద్ద ఆశ్చర్యం లేదు.

తన జీవితం వేరు. నా జీవితం వేరు.

ఎవరి సమస్యలు వారికున్నాయి.

హాయ్ బాయ్‌ల కంటే కాస్త ఎక్కువ స్నేహం కావచ్చు.

వీలైతే కొంచెం పర్సనల్ విషయాలు కూడా పంచుకునే చనువు ఉండొచ్చు.

కానీ, ఎప్పుడూ పరిధి తప్పింది లేదు అనే

> "రేయ్ ... అసలీ ప్రపంచంలో అందమైంది ఏంటో తెలుసా..? జనాలంతా ప్రేమ.. ప్రేమ.. అని ఓ గోల చేస్తుంటారు? ఎక్కడుందోయ్ ప్రేమ. మనం చూస్తున్న అందరిలో నిజంగా ఉందంటావా? ఓ తోడు కావాలనుకుంటూ, గానుగెద్దు జీవితంలో దొర్లటానికి ప్రేమ, పెళ్లి అని పేర్లు పెట్టుకుంటారేమో! కానీ, ఒక్కటి మాత్రం నిజం. మోహం ఉంటుంది చూశావా.. అది నిప్పు కణికలాంటిది. అదీ అసలైన ఎలిమెంట్ ..."

కంటే సందర్భం రాలేదేమో కూడా. కానీ, ఆమెకు నాలోలోపల ఏదో ప్రత్యేకమైన స్థానం ఉందేమో! కారణం నాకూ తెలియదు. ఈ రెండు రోజుల పరిచయంలో ఆమె కొత్తగా అర్థమయినట్టనిపించింది. ఇంకా చెప్పాలంటే లోలోపల ఆమె పట్ల ఇన్నేళ్లుగా ఉన్న ఇమేజ్ ఇప్పుడు పూర్తి రూపానికి వచ్చింది. ఆమె అల్లరి వెనకున్న అసలు వ్యక్తిత్వం ఏమిటో తెలుస్తోంది.

ఇప్పుడు కళ్లముందు రెక్కల పిల్ల నిలబడింది. అరుదుగా కాదు.. నిరంతరం.. సహారాలా వ్యాపిస్తూ, నయాగరాలా దూకుతూ, తానే ప్రకృతిగా, ప్రకృతే తానుగా, అచ్చుపోసిన కోరికలా, ప్రపంచమంతా నిండిన దాహాన్ని తాగి, మోహాన్ని అద్దినట్టుగా, స్వచ్ఛంగా నవ్వుతూ, ఎలాంటి సంకోచాలు లేకుండా ఎగురుతూ, పొంగుతున్న అమృత ధారల కోసం నిస్సంకోచంగా వాలే ధైర్యం ఉన్న ఆదిమజాతి రెక్కల పిల్ల ఇది.

ప్రపంచాన్ని తేలిగ్గా తీసుకుంటున్న ఆమె ఇప్పుడే నన్ను లైట్‌గా తీసుకుంటుందేమో అనే ఊహే కష్టంగా ఉంది. కానీ, ఆమె అలా ఆలోచిస్తే తప్పు పట్టాల్సిందేమి లేదని తెలుసు. తనకా హక్కు ఉంది. క్షణంలో ఆమె ముందు మరుగుజ్జుగా మారిపోయాను.

ట్రిప్ ముగిసింది.

ఉదయాన్నే క్యాబ్‌లో భువనేశ్వర్ బయల్దేరాం. అక్కడి నుంచి ఫ్లయిట్‌లో ఆమె హైదరాబాద్ వెళ్లాలి. ఒకటీ అరా మాటల తర్వాత నిశ్శబ్దం అలుముకొంది. క్యాబ్ కంటే వేగంగా కదులుతున్న ఆలోచనలను అలసట మింగేసింది. నిద్రలోకి జారుకున్నాం. ఏదో మెత్తటి బరువు ... నన్నంటిపెట్టుకుని.

సడన్‌గా మెలకువొచ్చింది. నిలువెల్లా కమ్మేసిన మనోరంజని పరిమళం..

ఒడిలోకి జారి ప్రశాంతంగా నిద్రపోతోంది. నా చేతివేళ్లలో తన వేళ్ల బిగించి ఏ బాధా, భయమూ లేకుండా మరో లోకాన్ని కలలుకంటోంది. నన్ను మోహంగా లాగేసే కడలి కెరటమా..? రా రమ్మంటూ పిలుస్తున్న సంద్రమా...? నన్ను తనలో కలిపేసుకునే ప్రళయమా..?

కడలిని కావలించుకున్నట్టు క్షణకాలం ఉక్కిరిబిక్కిరి ..

మళ్లీ మగతలో పడ్డాను..

క్యాబ్ ఆగింది..

బిజుపట్నాయక్ ఇంటర్నేషనల్ ఎయిర్ పోర్ట్..

చేతిలో చేయి ... ఇంకా బిగిసే ఉంది.

• • •

"సెటిల్ డౌన్ విత్ మీ ... కవర్ మీ అప్ ... కడల్ మీ ఇన్ " ఎడ్ షీరన్ తన మ్యూజిక్‌తో మెత్తగా కోసేస్తున్నాడు.

ఏడాదిగా భువనేశ్వర్‌లో ఉంటున్నా, కోణార్క్ చూడటం ఇప్పటికి వీలయింది. బిజీ జాబ్ షెడ్యూల్ నుంచి కొంచెం ఊపిరి పీల్చుకోవాలని ఆరాటపడ్డ ట్రిప్ ఇలా ముగిసింది.

మెయిల్స్ చెక్ చేసి, ఆఫీసుకి రెడీ అవుతున్నా ...

ఇంకా సముద్రంలో ఆడుతున్నట్టే ... అలలతో సయ్యాటలో మునిగినట్టే.. నా చేతుల్లో ఆమె చేతులు బిగిసినట్టే ఉంది.

మొబైల్ బ్లింక్ అయింది ... వాట్సాప్ మెసేజ్.

"నా చేతుల్లో ఇంకా నీ వెచ్చదనమే..
నా పాదాలింకా నీ అలల తాకిడిలోనే..
నేనింకా నన్నంతా చుట్టేసిన నీ గుండెలపైనే.."

ఒక్కసారిగా చంద్రభాగ సముద్రాన్ని కావలించుకున్న అనుభూతి మళ్లీ...!

కథ మొదలయిందా....?!

సెల్ నెం: 84980 84024



ఫుడ్ కోర్ట్

## మసాలా కర్రీ

**కావలసిన పదార్థాలు**

మష్రూమ్స్ - పావు కిలో, ఆలూ (పెద్దది) - 1, ఉల్లిపాయ - 1, టమోటా - 1, అల్లం వెల్లుల్లి పేస్టు - ఒక టేబుల్ స్పూను, నూనె - 2 టేబుల్ స్పూన్లు, ఉప్పు - రుచికి తగినంత, పసుపు - పావు టీ స్పూను, కారం, గరం మసాల, ధనియాల పొడి - ఒక టీ స్పూను చొప్పున, పెరుగు - 3 టేబుల్ స్పూన్లు, కొత్తిమీర తరుగు - అరకప్పు, కస్తూరి మేతి - చిటికెడు, బిర్యాని ఆకు - 1, యాలకులు, లవంగాలు - 5 చొప్పున, దాల్చినచెక్క - అంగుళం ముక్క.

**తయారుచేసే విధానం**

తరిగిన మష్రూమ్, ఆలూ ముక్కలను విడివిడిగా కొద్దిసేపు నూనెలో వేగించి పక్కనుంచాలి. తర్వాత అదే కడాయిలో మరి కొద్దిగా నూనె వేసి బిర్యాని ఆకు, యాలకులు, లవంగాలు, చిదిమిన దాల్చిన చెక్క, ఉల్లి తరుగు, అల్లం వెల్లుల్లి పేస్టు, పసుపు, టమోటా ముక్కలు ఒకటి తర్వాత ఒకటి వేస్తూ వేగించాలి. ఇప్పుడు పెరుగు కూడా వేసి రెండు నిమిషాల తర్వాత కారం, ఉప్పు, మష్రూమ్, ఆలూ ముక్కలు కలిపి అరకప్పు నీళ్లు పోసి మూతపెట్టి పదినిమిషాలు మగ్గించాలి. తర్వాత ధనియాల పొడి, గరం మసాల, కస్తూరి మేతి, కొత్తిమీర తరుగు చల్లి రెండు నిమిషాల తర్వాత దించేయాలి. ఈ కర్రీ అన్నం లేదా పరాటాల్లోకి చాలా బావుంటుంది.



# మష్రూమ్స్... మజా మజా!



## సూప్

**కావలసిన పదార్థాలు**

మష్రూమ్స్ - 400 గ్రా., ఉల్లికాడల తరుగు - అరకప్పు, వెజిటబుల్ స్టాక్ - 2 కప్పులు, బటర్ - 3 టేబుల్ స్పూన్లు, కార్న్‌ఫ్లోర్ - 1 టేబుల్ స్పూను, పాలు - 1 కప్పు, ఉప్పు, మిరియాలపొడి - రుచికి తగినంత, కొత్తిమీర తరుగు - అరకప్పు.

**తయారుచేసే విధానం**

బటర్‌లో మష్రూమ్స్ ముక్కలు, ఉల్లికాడల తరుగు వేసి మెత్తబడేవరకు వేగించాలి (మష్రూమ్స్ నుండి నీరు ఊరుతుంది. ఆ నీటిని పారబోయకూడదు). ఉప్పు, మిరియాల పొడి కూడా వేసి మరికొద్ది సేపు మగ్గించి దించేసి పూర్తిగా చల్లారనివ్వాలి. ముక్కల్ని మిక్సీలో పేస్టులా చేసుకుని వెజిటబుల్ స్టాక్‌తో పాటు మరిగించాలి. తర్వాత పాలు, నీటిలో కరిగించిన కార్న్‌ఫ్లోర్ కలపాలి. దించే ముందు కొత్తిమీర చల్లాలి. ఈ సూప్ బ్రెడ్ / పిజ్జాలతో సైడ్ డిష్‌గా సిప్ చేస్తే బాగుంటుంది.



## మంచూరియా

**కావలసిన పదార్థాలు**

మష్రూమ్స్ - 200 గ్రా., మిరియాల పొడి - ఒక టీ స్పూను, బియ్యప్పిండి, మైదా, కార్న్‌ఫ్లోర్ - 3 టేబుల్ స్పూన్ల చొప్పున, ఉప్పు - రుచికి తగినంత, కారం - ఒక టీ స్పూను, నీరు - అరకప్పు, నూనె - వేగించడానికి సరిపడా, ఉల్లిపాయలు - 2, వెల్లుల్లి రెబ్బలు - 4, సోయా సాస్ - 2 టీ స్పూన్లు, పచ్చిమిర్చి - 4, టమోటా సాస్ - ఒక టేబుల్ స్పూను, టమోటా ప్యూరీ - 2 టేబుల్ స్పూన్లు, కొత్తిమీర తరుగు - అలంకరణకు.

**తయారుచేసే విధానం**

ఒక బౌల్‌లో బియ్యప్పిండి, కార్న్‌ఫ్లోర్, మైదా, కారం, ఉప్పు (ఇష్టమైతే చిటికెడు ఆరంజ్ ఫుడ్ కలర్) వేసి నీటితో జారుగా కలుపుకోవాలి. రెండు ముక్కలుగా తరిగిన మష్రూమ్స్‌ను జారులో ముంచి నూనెలో దోరగా వేగించి పక్కనుంచాలి. ఇప్పుడు మరో కడాయిలో రెండు టేబుల్ స్పూన్ల నూనె వేసి ఉల్లి తరుగు, పొడుగ్గా చీరిన పచ్చిమిర్చి, వెల్లుల్లి తరుగు చిటికెడు ఉప్పు వేసి వేగించాలి. తర్వాత సోయా సాస్, టమోటా ప్యూరీ, సాస్ (ఇష్టమైతే అజినమోటో చిటికెడు) వేయాలి. రెండు నిమిషాల తర్వాత పక్కనుంచిన మష్రూమ్స్ వేసి చిక్కబడేవరకూ ఉంచి కొత్తిమీర చల్లి దించేయాలి. ఇవి స్నాక్స్‌గా లేదా భోజనంతో పాటు సైడ్ డిష్‌గా బావుంటాయి.






# చురుకైన చీమ సోమరిపోతు మిడత

ఒక అడవిలో ఒక పెద్ద చీమలదండు ఉంది. అందులోని చీమలన్నీ ఎంతో కష్టపడి ఆహారాన్ని సేకరిస్తూ, చురుకుగా ఉండేవి. రోజూ తెల్లవారగానే లేచి, ఆహారాన్ని వెతికడం, దాన్ని వివిధ పరిమాణాల్లో కత్తిరించి సేకరించడం, పుట్టలోకి తీసుకెళ్లి భద్రంగా దాచడం... ఎప్పుడూ ఇదే పని చీమలకు. ఆ చీమల పుట్ట పక్కనే ఒక మిడత ఉండేది. అది దొరికిన ఆహారాన్ని తినడం, ఆడుకోవడం, పడుకోవడం తప్ప ఏ పనీ చేసేది కాదు.

రోజూ కష్టపడుతున్న చీమలను చూసి "ఎందుకు అలా కష్టపడతారు. ఇప్పుడు మీ దగ్గర కావల్సినంత ఆహారం ఉందిగా. హాయిగా తినండి. విశ్రాంతి తీసుకోండి" అని సలహా ఇచ్చింది.

దానికి రాణీ చీమ "ఇప్పుడు తినడానికి ఉంది కదా... అని విశ్రాంతి తీసుకుంటే శీతాకాలంలో ఏమీ దొరకదు. నువ్వూ మాలానే ఆహారాన్ని సేకరించి, దాచుకోవడం నేర్చుకో" అంది.

"శీతాకాలానికి ఇంకా చాలా సమయం ఉందిలే. అప్పుడు చూద్దాం" అని రాణీ చీమ మాటలను పట్టించుకోలేదు మిడత. శీతాకాలం రానే వచ్చింది. మిడత కడుపు నిండడం కష్టమయిపోయింది. తిండి కోసం ఎన్నో చోట్ల వెతికినా ఏమీ దొరకలేదు మిడతకు. తిరుగుతూ, తిరుగుతూ ఆకలికి తట్టుకోలేక కిందపడిపోయింది. అది చూసిన చీమలు, మిడతను మోసుకెళ్లి, ఆహారం పెట్టి బతికించాయి.

"చూశావా... రేపటి గురించి ఆలోచించకపోతే ఎలాంటి పరిస్థితి వస్తుందో!" అంది రాణీచీమ, మిడతతో. తప్పు తెలుసుకున్న మిడత అప్పట్నించి సోమరితనం వదిలేసి, కష్టపడి పనిచేస్తూ దాచుకోవడమూ మొదలెట్టింది.

చూశారా! పిల్లలూ... మీరు కూడా చీమల్లా భవిష్యత్ గురించి ముందుగానే ఆలోచించి రోజూ చదవాలి. అంతేగానీ "పరీక్షలప్పుడు చదువుదాం... లే" అని అనుకుంటే మిడతలా ఇబ్బందులు పడకతప్పదు!





మంచి పద్యం

**ఏరకుమీ కసుగాయలు**
**దోరకుమీ బంధుజనుల దోషముసుమ్మీ**
**పారకుమీ రణమందున**
**మీరకుమీ గురువులాజ్ఞ మేదిని సుమతీ!**

**భావం:** భూమిపైన పడ్డ పచ్చికాయలు ఏరుకుని తినకూడదు, బంధువులను తిట్టకూడదు, యుద్ధం నుంచి భయపడి పారిపోకూడదు, పెద్దలు, గురువుల ఆజ్ఞలను జవదాటకూడదు.

## దారి చూపించండి





## విలువ ఎంత?

5 + = 5

\- = 0

\+ = 0

= ?

మనలాగ కర్రీ పాలు తాగదట!




| | |
|---|---|
| thumb |  |
| rabbit |  |
| binder |  |
| recycle |  |
| rainbow |  |
| cricket |  |
| teacher |  |
| sandals |  |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| s | r | e | h | c | a | e | t | i |
| v | b | m | v | y | w | p | m | u |
| w | e | l | c | y | c | e | r | a |
| o | p | b | m | u | h | t | v | k |
| b | t | e | k | c | i | r | c | t |
| n | u | v | t | i | b | b | a | r |
| i | u | l | e | t | i | n | k | q |
| a | s | l | a | d | n | a | s | q |
| r | v | k | b | i | n | d | e | r |

# చుక్కలు కలపండి



# రంగులు వేయండి





## తబలాతో కొట్టాడు!

**ఆ** చిట్టి పొట్టి చేతులకు ఇంకా సరిగా ఎముకలు కూడా వచ్చినట్టు లేదు, అప్పుడే తబలా వాయిస్తున్నాడేంటి! అని ఆశ్చర్యపోకండి. ఇతని పేరు దేవేశ్ ప్రఫుల్‌భాయ్ రాథోడ్. రెండేళ్ల వయసు నుంచే తబలా వాయించడం నేర్చుకున్న ఈ గుజరాతీ బుడ్డోడు కేవలం తబలా వాయించడమే కాదు, వాయిస్తూ పాటలు కూడా పాడతాడు. అంతేనా ఇప్పటికే సౌరాష్ట్రలోని 28 ప్రదేశాల్లో ప్రదర్శనలు (14 నవంబర్ 2015 నుంచి 19 జూలై 2016 దాకా) ఇచ్చి వరల్డ్ రికార్డు సృష్టించాడీ బుడతడు. అతి చిన్న వయసులో అత్యధిక తబలా ప్రదర్శనలు ఇచ్చిన కళాకారుడిగా ప్రఫుల్‌భాయ్‌కి 'వరల్డ్ రికార్డ్ ఇండియా' గుర్తింపు లభించింది. ప్రస్తుతం ప్రఫుల్ వయసు ఆరేళ్లు.

## రబ్బరు బొమ్మలాంటి చేప

**చూ**సేందుకు అచ్చం రబ్బరు బొమ్మలా ఉన్న ఈ చేప పేరు 'సీ రావెన్' (sea raven). పారదర్శకమైన శరీరంతో ఉండే ఈ చేపల ఎముకలు బలిష్టంగా ఉంటాయి. సముద్రపు అట్టడుగున మాత్రమే జీవించే ఇవి అప్పుడప్పుడూ మాత్రమే పైకి వస్తుంటాయి. చిన్న చిన్న పురుగులను, కీటకాలను భుజిస్తాయి. వీటి మొప్పలు చూడడానికి ముత్యపు చిప్పల్లా ఉంటాయి. వాయవ్య అట్లాంటిక్ సముద్రంలో అక్కడక్కడా, ఉత్తర పసిఫిక్ సముద్రంలో ఎక్కువగా కనిపించే ఈ చేపలు, 60 సెంటీమీటర్ల పొడవుదాకా పెరుగుతాయి. పరిమాణాన్ని బట్టి ఆడచేపలు ఒకేసారి 15 వేల గుడ్ల దాకా పెడతాయి.



## తేడాలు కనిపెట్టండి?



## మీకు తెలుసా?

- మనుషుల్లానే పాండాలు కూడా బాధలో ఉన్నప్పుడు ఒంటరిగా కూర్చుంటాయి.
- జర్మనీలోని టెక్నికల్ యూనివర్సిటీ ఆఫ్ మూనిచ్‌లో కిందకు దిగడానికి మెట్లకు బదులుగా జారుడు బల్లలు ఉంటాయి.

**జవాబులు:**
**విలువ ఎంత?** 0
**తేడాలు కనుక్కోండి:**
కళ్లలో తెల్లని మచ్చలు, నాలుక మీద గీత, కాలి మీద మచ్చలు, వెనక పువ్వు, ముందు గడ్డి వాము



# మనోడు... అగ్నిపర్వతారోహకుడు!

**చదువుకోవాలి... మంచి ఉద్యోగం తెచ్చుకోవాలి... జీవితంలో స్థిరపడాలి. సాధారణ యువకుడి కల ఇలాగే ఉంటుంది. కానీ సాయితేజ కాస్త వైవిధ్యంగా ఆలోచించాడు. ఎవరూ చేయని సాహసాలు చేయాలనుకున్నాడు. ప్రాణాల్ని పణంగా పెట్టి, ప్రమాదకరమైన అగ్నిపర్వతాన్ని అధిరోహించాడు. ఆ సాహసం చేసిన తొలి భారతీయుడు, తొలి తెలుగువాడు సాయితేజ.**

ఎదురుగా అగ్నిపర్వతం. శరీరమంతా ఉడికిపోయే వేడి. ఏ నిమిషంలో ఎట్నుంచి పడతాయో తెలియని లావా గోళాలు... తలుచుకుంటేనే ఒళ్లు జలదరిస్తుంది. అది కూడా ఆహారం లేకుండా... నీళ్లతోనే కడుపు నింపుకుంటూ ... అంతెత్తు పర్వతాన్ని ఎక్కడమంటే మాటలా. ఆ అవరోధాలన్నింటినీ చాలా ఇష్టంగా దాటేశాడు పెద్దినేని సాయితేజ. సాయి తండ్రి నాగేశ్వరరావుది కొత్తగూడెం, తల్లి భవానిది గుంటూరు. హైదరాబాద్ వచ్చి స్థిరపడ్డారు. చిన్నప్పట్నుంచీ సాయితేజ ఆలోచన డిఫరెంట్‌గా ఉండేది. తాను పదోతరగతిలో ఉండగా అమెరికాలో 26/11 దాడి జరిగింది. ఆ సంఘటన గురించి పత్రికల్లో చదివి... దానిపై ఒక నివేదిక లాంటిది తయారుచేసి, క్రైమ్ బ్రాంచ్ పోలీసులకు అందజేశాడు. ఆ ఉత్సాహం ఓ ఉన్నతాధికారికి ముచ్చటగా అనిపించింది. సీసీ కెమెరాలతో ముడిపడిన ఓ చిన్న కేసును పరిశోధించమంటూ అప్పజెప్పారు. సాయితేజ కొన్ని గంటల్లో తేల్చిపడేశాడు. ఇంటర్ పూర్తి చేశాక అమ్మానాన్నలు బలవంతంగా బీటెక్‌లో చేర్పించారు. స్టార్టప్ ఆలోచన ఉండడంతో మొదటి ఏడాదిలోనే చదువును వదిలేసి, ఓ చిన్న కంపెనీ మొదలుపెట్టాడు. ఆ కంపెనీ ద్వారా సెక్యూరిటీ కన్సల్టింగ్ సర్వీసులు అందించేవాడు. అలా, పద్దెనిమిదేళ్లకే తన కాళ్లపై తాను నిల్చున్నాడు. అయినా జీవితంలో ఏదో అసంతృప్తి. తనను తాను తెలుసుకునే ప్రయత్నంలో ప్రయాణాల్ని ఓ అభిరుచిగా మార్చుకున్నాడు. చాలా ప్రదేశాలు తిరిగాడు. అప్పుడే, పర్వతారోహణపై మనసు మళ్లింది.. కానీ ఇప్పటికే చాలా మంది ఎక్కి దిగేశారు. ఇక తాను చేసేదేముంది? అనిపించింది. పర్వతాలు కాదు.. అగ్నిపర్వతాలైతే... అన్న ఆలోచన వచ్చింది. సాహసికులు పెద్దగా దృష్టి పెట్టని రంగమది. మన దేశంలో అయితే, అగ్నిపర్వతారోహకులు దాదాపుగా లేరనే అంటాడు సాయితేజ.

### అడుగడుగునా గండాలే....

సాధారణ పర్వతం ఎక్కినంత సులువు కాదు, అగ్నిపర్వతం ఎక్కడం. చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. విదేశాల్లోని అగ్నిపర్వతారోహకులతో ముందుగా మాట్లాడాడు సాయితేజ. అవసరమైన సలహాలూ సూచనలూ తీసుకున్నాడు. ప్రపంచంలోని అగ్నిపర్వతాల వివరాలన్నీ సేకరించాడు. వాటిలోంచి... ఇండొనేషియాలోని హెల్ మెహరా దీవుల్లో ఉన్న మౌంట్ డుకొనా అగ్నిపర్వతాన్ని ఎంచుకున్నాడు. అందులో నుంచి లావా 1933 నుంచీ ఇప్పటివరకు నిరంతరం ప్రవహిస్తూనే ఉంది. తన సాహసయాత్రకు తల్లిదండ్రులను ఒప్పించడం సవాలుగా మారింది. కొడుకు నిర్ణయం విని, తల్లి భవానికి జ్వరం వచ్చేసింది. మూడు రోజులు ఆసుపత్రిలోనే ఉన్నారు. తల్లిదండ్రులకూ, సోదరికీ నచ్చజెప్పి బయల్దేరాడు సాయి. మే నెలలో ఇండొనేషియా రాజధాని జకార్తా చేరుకున్నాడు. అక్కడి నుంచి హెల్ మెహరా దీవికి ప్రయాణమయ్యాడు. దట్టమైన అటవీప్రాంతమది. ప్రాణాంతకమైన విష సర్పాలకు నెలవు. కొత్తవాళ్లకు ఆ దారి అర్థం కాదు. తన వస్తువులను మోసేందుకూ దారి చూపేందుకూ.... ఇద్దరు స్థానికులను మాట్లాడుకున్నాడు. కొండపైకి నడక ప్రారంభమైంది. దాదాపుగా 1,335 మీటర్ల ఎత్తు! తాను తెచ్చుకున్న శాకాహారం నాలుగురోజులకే అయిపోయింది. అక్కడ దొరికేవి చేపలూ, అడవి జంతువులే... వాటిని తినలేక రెండు రోజులపాటూ నీళ్లు తాగే గడిపాడు. కొండెక్కుతుంటే లావా బంతులూ, నిప్పురవ్వలూ ఎగిరిపడుతుండేవి.... దట్టమైన పొగలతో కంటికి ఏమీ కనిపించేది కాదు. ప్రతి యాభై సెకన్లకూ ఓ లావా బాంబు పేలేది. వాటిని తప్పించుకుంటూ, ఆరు రోజుల తర్వాత... అగ్నిపర్వత శిఖరానికి చేరుకున్నాడు. అక్కడి వేడికి చేతులు బొబ్బలెక్కిపోయేవి. పర్వతం పై నుంచి మధ్య భాగంలోకి చూస్తే లావా ఉప్పొంగి బయటికి వస్తూ కనిపిస్తుంది. శిఖరానికి చేరగానే... దేశం గుర్తుకొచ్చింది. ఆతర్వాత... తనను వెన్నంటి నిలుస్తున్న ఆత్మీయులు గుర్తుకొచ్చారు. బ్యాక్‌పాక్‌లోంచి మువ్వన్నెల జెండా తీసి... సగర్వంగా పాతాడు. భారతీయులు కూడా అగ్నిపర్వతాలు అధిరోహించగలరని నిరూపించాడు. 'ఆ ప్రయాణంలో నేను భయాన్ని జయించాను. జీవితంలో అంతకు మించిన బలం ఏం ఉంటుంది?' అంటాడా యువకుడు.

త్వరలో, మరో అతిపెద్ద అగ్నిపర్వతాన్ని ఎక్కేందుకు సన్నాహాలు చేస్తున్నాడు సాయితేజ. అంటే, మరో మువ్వన్నెల జెండా... నిప్పుకణికల గౌరవ వందనాన్ని స్వీకరించబోతోంది.



## హెపటైటిస్ వైరస్‌ను అడ్డుకునే చికిత్స

**హెపటైటిస్ :** హెపటైటిస్ వైరస్ ప్రభావం ప్రధానంగా కాలేయంపై ఉంటుంది. ఈ వైరస్ మూలంగా అనేక మంది తీవ్రమైన కాలేయ వ్యాధి బారినపడి ప్రాణాలు కోల్పోతున్నారు. ఈ వైరస్ ముఖ్యంగా రక్తం ద్వారా వ్యాపిస్తుంది. వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం కారణంగా చెప్పుకోవచ్చు. తల్లి నుంచి శిశువుకు కూడా సంక్రమించే అవకాశం ఉంది. లైంగిక సంబంధాల ద్వారా కూడా వ్యాపిస్తుంది. ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. లో గ్రేడ్ ఫీవర్, పొట్ట పైభాగంలో నొప్పి, జాండిస్ వంటి లక్షణాలు కనిపిస్తాయి. అయితే హెపటైటిస్ బి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది. వాంతులు, కొన్నిసార్లు విరేచనాలు, కడుపు ఉబ్బరంగాఉండటం, పొట్టలో నొప్పి, రక్తనాళాలు వాచిపోవడం, కిడ్నీ సమస్యలు, ప్లేట్‌లె ట్స్ కౌంట్ పడిపోవడం జరుగు తుంది. అజీర్తి, పొట్ట ఉబ్బరంగా అనిపించడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. అడ్వాన్స్ స్టేజ్‌కు వెళ్లినట్లయితే బరువు కోల్పోవడం, వికారం, వాంతులు, ఏకాగ్రత లోపించడం, కుడివైపు పొట్టలో నొప్పి, కాలేయం వాపు వంటి లక్షణాలుంటాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ వైరస్‌ను అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. కాలేయంలో పేరుకుపోయిన కొవ్వు నిలువలను తిరిగి బయటకు పంపించడం హోమియోతో మాత్రమే సాధ్యమవుతుంది.

## హెచ్ఐవి, హెర్పిస్‌ల ఆట కట్టించొచ్చు

**హెచ్ఐవి :** హెచ్ఐవి సోకితే మరణం తప్పదా? అంటే కానే కాదు. చికిత్స లేని వ్యాధిగా హెచ్ఐవికి పేరుంది. అయితే హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, చిన్న చిన్న వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

**హెర్పిస్ సింప్లెక్స్**

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

**హోమియో చికిత్స**

హెచ్ఐవి, హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## పిల్లలు పుట్టకపోవడం శాపం కానేకాదు

**ఆధునిక చికిత్సలు** ఎన్ని అందుబాటులోకి వచ్చినా సంతానలేమితో బాధపడుతున్న దంపతులకు పరిష్కారాన్ని చూపలేకపోతున్నాయి. అయితే హోమియో మాత్రం ఇందుకు భిన్నంగా సత్ఫలితాలను అందిస్తోంది. ఏడాదిగా ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించకపోయినప్పటికీ గర్భం రాకపోయినట్లయితే సంతానలేమి సమస్య ఉన్నట్లుగా భావించాలి.

**కారణాలు ఇవి కావచ్చు :** వీర్యకణాలు తక్కువగా ఉంటే సంతానం కలిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. వేరికోసిల్, హైడ్రోసిల్, మూత్ర సంబంధ వ్యాధులు, సుఖ వ్యాధుల వల్ల కూడా వీర్యకణాలు నశించి సంతానలేమికి కారణమవుతూ ఉంటాయి. దీర్ఘకాలంగా షుగర్ వ్యాధి ఉండటం, అధిక బరువు, వృషణాలకు దెబ్బలు తగలడం, ప్రమాదాల్లో వెన్నుకు గాయాలవడం, హార్మోన్ల అసమతుల్యత, క్రోమోజోముల లోపాలు, విపరీతంగా స్మోకింగ్ చేయడం వంటివి కూడా పురుషుల్లో సంతానలేమికి కారణమవుతుంటాయి. బిగుతైన దుస్తులు ధరించడం, ప్రతిరోజు వేడి ఎక్కువగా ఉండే నీళ్లతో స్నానం చేసే అలవాటు ఉండటం వంటివి కూడా కారణమవుతాయి.

**హోమియో చికిత్సతో ఆనందం :** సంతానలేమికి కచ్చితమైన కారణం తెలుసుకుని చికిత్స అందిస్తే సంతానసాఫల్యం తప్పక కలుగుతుంది. వీర్యకణాల లోపం ఉంటే హోమియో మందులు తీసుకోవడం ద్వారా వీర్యపుష్టి కలుగుతుంది. వీర్యకణాల కదలికలు పెరుగుతాయి. హార్మోన్ల సమస్యలు సైతం హోమియో చికిత్సతో తొలగిపోతాయి. అంగస్తంభనలు లేకపోవడం వంటి సమస్య ఉంటే దూరమవుతుంది. మొత్తంగా సంతానలేమి కారణాలన్నీ దూరమయిపోయి సంతానం సిద్ధిస్తుంది.

## నరాల జబ్బులుంటే జీవితం నరకమేగా!

**చేతులు,** కాళ్లు, పాదాలు, ముఖం, నోరు...ఇలా శరీరంలోని అన్ని భాగాల నుంచి నరాలు వెన్నుపాముతోనూ, మెదడుతోనూ అనుసంధానించబడి ఉంటాయి. ఈ నరాల వ్యవస్థ ద్వారానే భౌతిక అనుభూతుల తాలూకు సంకేతాలను మెదడుకు అందుతాయి. అంటే కాలికి దెబ్బతగిలితే నొప్పి తెలియడం వెనక కారణం మెదడుకుసంకేతాలు చేరడమే. అయితే కొందరిలో కొన్ని కారణాల వల్ల ఈ నరాల వ్యవస్థ దెబ్బతింటుంది.

**కారణాలు :** కుటుంబంలో ఎవరైనా ఈ సమస్యతో బాధపడుతున్నట్లయితే వారి పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. డయాబెటిస్‌తో బాధపడే వారిలో ఎక్కువగా కనిపించే సమస్య ఇది. గాయాలు కావడం, దీర్ఘకాలంగా అనారోగ్యం ఉండటం, ఇన్‌ఫెక్షన్లు వంటివి కూడా కారణమవుతాయి. ఆల్కహాల్ అధికంగా సేవించడం, విషపూరితమైన కెమికల్స్‌కు ఎక్స్‌పోజ్ కావడం, కొన్ని రకాల వైరస్‌లు, బ్యాక్టీరియాలు నేరుగా నరాల టిష్యూపై దాడి చేయడం వల్ల కూడా ఈ సమస్య తలెత్తవచ్చు. హెచ్ఐవితో బాధపడే వారిలోనూ పెరిఫెరల్ న్యూరోపతి డెవలప్ అయ్యే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు**

చేతులు, పాదాల్లో పొడిచినట్లు అనిపించడం, తిమ్మిర్లు రావడం, చేతుల్లో నుంచి వస్తువులు జారిపడటం, పురుషుల్లో అంగస్తంభనలు తగ్గిపోవడం, మలబద్ధకం, జీర్ణసమస్యలు రావడం, డయేరియా, చెమటలు అధికంగా పట్టడం వంటి లక్షణాలుంటాయి.

**హోమియో చికిత్స**

నరాల సంబంధ సమస్యలకు హోమియో మందులు అద్భుతంగా పనిచేస్తాయి. తిమ్మిర్లు, చెమటలు అధికంగా పట్టడం వంటివి తగ్గిపోతాయి. అంగస్తంభన సమస్యలు దూరమవుతాయి. మొత్తంగా కాంప్లికేషన్స్ అన్నీ దూరమయి ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

ADVT

## కొత్త పుస్తకాలు

## పాడుకున్నోళ్లకు పాడుకున్నన్ని!

తెలుగువారికి అచ్చొచ్చిన సంఖ్య వెయ్యినూట పదహార్లు! ఇన్ని సినిమా పాటలు ఒకే దగ్గర కనిపిస్తే సంగీత ప్రియులు ఎగిరి గంతేయరూ! ఈ బృహత్తర పాటల పుస్తకాన్ని మనముందుకు తెచ్చినవారు రాజమండ్రికి చెందిన గొల్లపూడి వీరాస్వామి సన్ పబ్లిషర్లు. పుస్తకం చూడగానే చాలా రిచ్‌గా పకడ్బందీగా 'అబ్బో' అనిపిస్తుంది. కూర్చిన పాటలన్నీ మధుర గీతాలు కాదనే విషయం సంకలనకర్తకూ తెలుసు కాబట్టే లోకో భిన్న రుచి అంటూ ముందుమాటలోనే సెలవిచ్చారు. ఇంత పెద్ద పుస్తకాన్ని తీసుకువచ్చేప్పుడు అరకొర అచ్చుతప్పులు దొర్లడం సహజమే కాని రచయితల పేర్లతో పాటు సినిమా పేర్లు, సంగీత దర్శకుల పేర్లు సైతం మారిపోవడం శోచనీయం. 'బొమ్మను చేసి ప్రాణము పోసి' (దేవత) పాట రాసింది శ్రీశ్రీ అయితే అచ్చులో వేటూరి అని ఉంది. 'ఒక దీపం వెలిగింది, ఒక రూపం వెలిసింది' పాట 'ఏకవీర' చిత్రంలోని దైతే 'ఉమ్మడి కుటుంబం' అని ఉంది. 'కళ్లలో పెళ్లి పందిరి కనపడసాగే' (ఆత్మీయులు) పాట రాసింది శ్రీశ్రీ అయితే సినారె అని ఉంది. 'విచిత్ర కుటుంబం' చిత్రానికి సంగీత దర్శకులు టి.వి. రాజు. కాని, అచ్చులో కె.వి.మహదేవన్ అని ఉంది. ఇక అక్షరాలు మిస్సవడమనేది చాలాచోట్ల కనిపించింది. ఉదాహరణకు 'కలయిదని... నిజమిదనీ' (దేవదాసు - పేజీ నెం 93) చూడొచ్చు. ఈ బృహత్కార్యానికి నడుం బిగించినప్పుడు హిమాలయాలంత ఓపిక కూడా ఉండాలి. లేకపోతే అనుకున్నది అనుకున్నట్టు రాదు. ఏదేమైనా ఇదొక మంచి ప్రయత్నం - అభినందనీయం.

**- గొరుసు**

**1116**
**మధుర సినీ గీతాలు**
సంకలనం :
జయంతి చక్రవర్తి
**పేజీలు :** 1280,
**వెల :** రూ.450
**ప్రతులకు :**
93905 26272




## మానవీయ కోణంలో...

విరించి అనే కలం పేరుతో కథలు రాసే తల్లాప్రగడ గోపాలకృష్ణ తన 24 కథలతో ఈ సంకలనం వెలువరించారు. కథలను చదివినవారికి ఆయన దాదాపు ప్రతి మానవీయ కోణాన్నీ స్పృశించారనిపిస్తుంది. అటు ఇతివృత్తాలకు సంబంధించి కానీ, ఇటు భాషకు సంబంధించి కానీ ఎటువంటి భేషజాలు, అతిశయాలూ లేక, ఆచరణాత్మకంగా ఉండడంతో కథలన్నీ చదివిస్తాయి. ఇంకా చదవాలనిపిస్తాయి. వృద్ధుల జీవితాలను ఇతివృత్తంగా చేసుకుని ఆయన రాసిన 'ఆశ్రమ', 'శ్రావణ' వంటి కథనాలు సరికొత్త మానవీయ దృక్పథాన్ని ఆవిష్కరించాయి. ముఖ్యంగా 'సహనాభవతు' కథనం అనుమానపు భార్య మనస్తత్వానికి చక్కగా అద్దం పట్టింది. ఈ కథల్లోని ఇతివృత్తాలన్నీ పాఠకులకు కరతలామలకమే అయినప్పటికీ, ఆయన రచనా శైలి ఆ ఇతివృత్తాలకు తాజాదనం తెచ్చిపెట్టింది. కథల్లో సంప్రదాయికతతో పాటు, ఆధునికత కూడా చోటు చేసుకుంటుంది. ఆయన అభ్యుదయ భావాలకు కూడా 'చాప కింద నీరు' వంటి కొన్ని కథలు అద్దం పట్టాయి. కుమార్తెను మంచి ఇల్లాలిగా మార్చడానికి ఓ తండ్రి చేసిన ప్రయత్నాన్ని 'కార్యేషుదాసి' చక్కగా కళ్లకు కట్టించింది. ఇతివృత్తాలకు తోడు భాష కూడా బాగుండడంతో ఈ కథలు ఇట్టే ఆకట్టుకుంటాయి.

**- జి. రాజశుక**

**సహనాభవతు**, విరించి
**పేజీలు:** 264, **వెల:** రూ.150, **ప్రతులకు:** 0866 - 2436643




## సహృదయ దుబాసీ

కొల్లూరి సోమశంకర్ తెలుగు పాఠకులకే కాదు, వివిధ భాషల్లోని పాఠకులకూ చిరపరిచితులు. ఎవరెవరో రాసిన కథలను ఎంపిక చేసుకుని తెలుగు పాఠకులకు అందిస్తున్నారు. అంతేకాదు, మన తెలుగు భాషలోని మంచి కథలను హిందీలోకి అనువదిస్తున్నారు. ఈ సహృదయతే ఆయన కథల అనువాదంలోనూ కనబడుతుంది. ఈ సంపుటిలోని కథలను చదివితే ఎక్కడా అనువాదమని అనిపించవు. మూల కథ ఆంగ్లమైనా, బెంగాలీ అయినా, ఉర్దూ అయినా... తెలుగు కథంత సరళంగా ఆయన అనువాదం సాగింది. 'అమృతవర్షిణి', 'బేరం', 'వాళ్లిద్దరూ, ఆటోడ్రైవర్' వంటి కథలు సున్నితంగా హృదయాలను తాకుతాయి. విషయ సూచికలో కథ పేరుతో పాటు భాష, ఆ భాష రచయిత పేరు ఇస్తే బావుండేది. ఎందుకంటే, ఆయా భాషల పట్ల అభిమానం ఉన్నవారు ఆయా కథలను తొలుత చదవడానికి ఇష్టపడతారు కాబట్టి.

**- దేరా**

**నాన్నా తొందరగా వచ్చేయ్**, కొల్లూరి సోమశంకర్
**పేజీలు :** 66, **వెల :** రూ.80
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక దుకాణాలు




## ప్రపంచ సినిమా విభిన్న కోణంలో...

తెలుగులో సినిమా పుస్తకాలంటే... తప్పకుండా ఎక్కడో చోట నుంచి ఎత్తిరాసినవేగానీ, సినిమాను కొత్తగా పరిచయం చేసే రచనలు అస్సలు రావట్లేదనేది నిజం. సినిమాపై అపారమైన ప్రేమ, దాన్ని అర్థం చేసుకునే దృక్పథం, దృశ్యాలను అక్షరాల్లోకి అనువదించే చాతుర్యం ఉన్నవాళ్లే ఆకట్టుకునే సినిమా సాహిత్యాన్ని సృష్టించగలుగుతారు. అలాంటివాడే వెంకట్ శిద్దారెడ్డి. 'సినిమా ఒక ఆల్కెమీ' అంటూ ఆయన ప్రపంచ సినిమాను తనదైన దృష్టికోణం నుంచి, అనుభూతి నుంచి పాఠకునికి పరిచయం చేయాలని చూశారు. నిజానికి ఇవి సినిమా సమీక్షలో, విశ్లేషణాత్మక వ్యాసాలో కావు. ఒక ఫార్మాట్‌లో సాగని కొత్తరకం సినిమా సాహిత్యం. అప్పటికే ఆయా సినిమాలు చూసినవారైనా సరే శిద్దారెడ్డి వ్యాసాలు చదివిన తర్వాత కచ్చితంగా మళ్లీ ఒకసారి వాటిని చూడాలనుకుంటారు. 'ఫిజ్‌కరాల్డో', 'బైసికిల్ థీవ్స్', 'ఇకిరు', 'సిటిజెన్ కేన్', 'చిల్డ్రన్ ఆఫ్ హెవెన్', 'వైల్డ్ స్ట్రాబెర్రీస్', 'పూజాఫలము', 'షిప్ ఆఫ్ థీసియస్' వంటి 30 సినిమాలపై ఒక పత్రికలో ఫీచర్‌లాగా రాసిన శిద్దారెడ్డి అనుభూతుల సమాహారమిది. రెగ్యులర్ సినిమా రచనలకు భిన్నంగా ఆయన రచన విధానం సాహితీ ప్రక్రియలాగా సాగింది కాబట్టే 'సినిమా ఒక ఆల్కెమీ' కవర్‌పేజీ నుంచి చివరి పేజీదాకా సాహిత్య సంపుటిని తలపిస్తుంది.

**- చల్లా**




**సినిమా ఒక ఆల్కెమీ**, వెంకట్ శిద్దారెడ్డి
**పేజీలు:** 272, **వెల:** రూ.180
**ప్రతులకు:** నవోదయ 040-24652387

## వంతెన

### ఈ వారం కవితలు



యాభై సంవత్సరాల నుంచి
ఈ వంతెన మీద నడుస్తున్నా
ఏం మార్పులేదు, కాస్త ఒళ్లు చేసింది
పెద్దదయింది
వస్తువులకూ వయసుంటుందా
వృద్ధాప్యముంటుందా?
మోసీ, మోసీ యిక మోయలేమని
మొరపెడతాయా, దుఃఖిస్తాయా
ఎవడన్నా బరువు దించుతాడని
ఎదురుచూస్తాయా -
కళ్లు కనపడవు
నడుం వంగిపోయింది
యాభై సంవత్సరాల నుంచి
ఈ వంతెన నన్ను మోస్తుందో
నేను వంతెనని మోస్తున్నానో -

నడుం వంగినా కుంగిపోని
వంతెనకు లాల్ సలామ్‌లు

**- కె. శివారెడ్డి,** 040 - 2406 4195

## కర్టెన్స్

స్వార్థం ఎరువుగా వేసి
దున్నిన దుక్కుల్లో
కలల పంటల్లేవు కానీ
కాంక్రీటు మేడలు మొలిచాయి
తీగలెన్ని అల్లుకున్నా
ఆకులెంత పచ్చగున్నా
ప్లాస్టిక్ పూలనిండా
స్ప్రే పరిమళాల కంపే
ఆకాశం భూమి క్షితిజం
కలసినట్టుగా కనిపించే అబద్ధం
నాకు నీవెంత అవసరమో
నీకు నేను కూడా అంతే
పాము పడగ కంటే
నెమలి పింఛం విశాలం
ఒకటి రాజకీయం
మరొకటి ప్రజాస్వామ్యం



**- ఈతకోట సుబ్బారావు,** 94405 29785

# బెంటోవాగన్...

## మీ లోకల్ డబ్బావాలా!







**పి**ల్లల్ని ఉదయం ఎనిమిదింటికే స్కూళ్లకు పంపించాలి. అప్పటికల్లా టిఫిన్, మధ్యాహ్నానికి లంచ్ బాక్స్ సిద్ధం చేయాలి. మధ్యలో పిల్లలకి స్నానాలు, శ్రీవారికి కాఫీలు, టిఫిన్లు, ఓపక్క వంట మాడిపోతుంది. రుచీ పచీ ఉండదు. ఆ కూరనే బాక్సుల్లో పెట్టి పంపించాలి. తీరా సాయంత్రం చూస్తే... నిండుకుండల్లా లంచ్ బాక్సులు, ఖాళీ కడుపులతో పిల్లలు ఇంటికొస్తారు. అప్పుడనిపిస్తుంది ఏ తల్లికైనా... 'కొంచెం టైముంటే బాగుండు కదా... రుచిగా వండి పిల్లలకి పెట్టేదాన్ని' అని. అలాంటి తల్లులు దేశంలో ప్రతిమూలా ఉంటారు. ఆ అమ్మల కోసమే వచ్చింది బెంటో వాగన్ స్టార్టప్. 'మీరు తీరిగ్గా వండండి మేడమ్! లంచ్ టైముకి బాక్సులు మేమందిస్తాం' అని భరోసా ఇస్తోంది. ప్రస్తుతానికి హైదరాబాద్‌లోనే సేవలందిస్తున్నా... త్వరలో మరిన్ని ప్రాంతాలకు విస్తరించే అవకాశం ఉంది.

సునీల్ కుమార్ సాఫ్ట్‌వేర్ ఇంజినీర్. ఉద్యోగం వదిలేసి ఈ లోకల్ డబ్బావాలా స్టార్టప్‌ను ప్రారంభించారు. ముంబైలో ఇప్పటికే సూపర్ హిట్టయిన డబ్బావాలా కాన్సెప్టునే స్ఫూర్తిగా తీసుకున్నారు. ప్రస్తుతం ఫుడ్ పాండా, స్విగ్గీ వంటి సంస్థలు రెస్టారెంట్ నుంచి మీరు ఆర్డర్ చేసిన ఆహారాన్ని ఎలా డెలివరీ చేస్తున్నాయో... బెంటోవాగన్ కూడా మీ ఇంటి ఆహారాన్ని మీ పిల్లలకు, భర్తకు మధ్యాహ్నం పన్నెండున్నరకల్లా చేరవేస్తుంది. బెంటోవాగన్ వెబ్‌సైట్లో ముందుగా వినియోగదారులు రిజిస్టర్ అవ్వాలి. అందులో పికప్ ఏరియా, డెలివరీ ఏరియాలను నింపాలి. బెంటో వాగన్ డెలివరీ బాయ్ మీ ఇంటికి వచ్చి లంచ్ బాక్స్ తీసుకుని... మీరు ఇచ్చిన అడ్రస్‌లో భోజన సమయానికంతా అందిస్తాడు. దూరాన్ని బట్టి ఛార్జ్ చేస్తారు. పికప్ ఏరియా... డెలివరీ ఏరియాల మధ్య దూరం అయిదు కిలోమీటర్ల లోపైతే నెలకు 500 రూపాయలు చెల్లించాలి. అదే 5 నుంచి 10 కిలోమీటర్ల మధ్య దూరమైతే 650 రూపాయలు చెల్లించాలి. 15 కిలోమీటర్ల కన్నా ఎక్కువ దూరమైతే ప్రతి అయిదు కిలోమీటర్లకు రూ.50 అదనంగా చెల్లించాలి. అదనపు డిస్కౌంట్లు, ఆఫర్లు కూడా అందుబాటులో ఉన్నాయి.

